# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౩౧]   సెప్టెంబరు 1952   [సంచిక ౯




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువకొరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయముగాలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయనలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును, విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరని-చో

సంచికలు చేరని-చో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండు-చో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

త్వరలో వస్తూంది!

విజ్ఞాన వినోదాలను
ఉత్తమ స్థాయిలో
అందించు



శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి

# పేదరైతు

దర్శకత్వం.. కె. బి. నాగభూషణం
అసోసియేట్.. ఇంటూరి

అంజలీదేవి
కన్నాంబ
శ్రీరామమూర్తి



చమ్రియా రిలీజ్

# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# మద్రాసు నగరం



మద్రాసు మహానగరం. అందమైంది. దిన దినానికి సర్వతో ముఖాభివృద్ధి నందుచున్నది. ఇందుకు రాష్ట్రింలోని వర్తక వ్యాపారాలు, రాష్ట్రిము మొత్తము మీద వచ్చేప్రభుత్వాదాయము కారణము. అయితే మద్రాసు రాష్ట్రింలోని ప్రధాన భాషా ప్రాంత్యాలు తమిళ, ఆంధ్రలుగా జగమెరిగిన విషయం. ఆంధ్ర ప్రాంత్యమునుండి ప్రభుత్వాదాయం విశేషమయినప్పటికి ఆంధ్రేతర ప్రాంత్యాలకు ముఖ్యంగా మద్రాసు అభివృద్ధికి అత్యధికంగా వినియోగించబడింది; వినియోగించ బడుతున్నది.

ఇకవర్తక వ్యాపారాల నిర్వాహణను చూస్తే ఆంధ్రులే అధికభాగం నిర్వహిస్తూ మద్రాసు నగర అభివృద్ధికి సర్వవిధాల సహాయపడుతూ వస్తున్నారు. కాబట్టే యీనాడు మద్రాసు మహానగర మయింది.

ఈస్టిండియా కంపెనివారు యీ నగరప్రాంత్యాన్ని ఆంధ్రపాలకుని యొద్దనుండి పొందారని చరిత్రాధారాలున్నవి. ఆరోజులలో యీప్రాంత్యములో ఆంధ్రజనాభ నే అధికమని చరిత్ర. ఆనాటినుండి యీనాటి వరకు యీనగరంలో నివసిస్తున్న ఆంధ్ర కుటుంబాలనేకములున్నవి. కాని ఆరోజుల్లో ఉద్యోగాలకని స్వస్థానాలను వదిలేసి మద్రాసుకు తమిళులంతమంది ఆంధ్రులు చేరుకొనియుండలేదు. కాబట్టి క్రమంగా తమిళుల జనాభా పెరిగినా స్థానికంగానున్న తెలుగువారు భారీగా వర్తకవ్యాపారాలు చేస్తూయున్నారు.

క్రమంగా ఇంగ్లీషు విద్యావ్యాప్తితోబాటు ఉద్యోగాలకని, పరిశ్రమల అభి వృద్ధితోబాటు పనిపాటలకని తెలుగువారు సయితం మద్రాసుకు చేరుకుంటునే వచ్చారు. అనేకమంది ఆస్థి పాస్తులు కొనుక్కొని స్థావరాలు ఏర్పరుచుకొన్నారు.

అయితే అనేక సంవత్సరాలనుండి నగరంలో నివసిస్తుండి, వివిధ ప్రాంత్యాలలో తెలుగు విద్యాబోధనా వసతుల లేమివలన తెలుగు కుటుంబాలవారు తమిళం నేర్చు కోక తప్పలేదు. అయినా మాట్లాడటం మాత్రం తెలుగే యీనాటికి కూడ. అయితే తమిళ భాషతో సంపర్కము వలన వారు మాట్లాడే తెలుగుభాష కొంత మార్పు చెందింది. అట్టిమార్పు అరవానికి కూడ వచ్చింది. అంతమాత్రంచేత అరవము చదువుచున్న తెలుగువారంతా తమిళుగానే శ్రీ సి. రాజగోపాలాచారిగారు చిత్రించడం వాస్తవికతకు చాలదూరం. మనం ఏదో రంగుకండ్ల అద్దాలతో చూచి ప్రపంచ మంతా అదే రంగులో నున్నదనుకోటం చాల శోచనీయం.

తాను మద్రాసు రాష్ట్ర ప్రధానిగా శ్రీ సి. రాజగోపాలాచారిగారు యింత తొందరపడి మద్రాసు నగర భవిష్యత్తునుగురించి మద్రాసు తమిళులదేనని, తమిళ భాషనభ్యసించిన తెలుగు వారందరు తమిళులేననడం భావ్యంకాదు. కాని యీతొందర పాటుకు కారణ మున్నది - త్వరలో ఆంధ్రరాష్ట్రమే నిర్మాణమయితే మద్రాసు ఆంధ్రు లకు కొంతభాగమైన దక్కుతుందేమోనన్న ఆదుర్దాప్రతిధ్వనిస్తున్నది.

ఇక ఆంధ్రుల వైఖరి చూడండి - రాయలసీమవారు మద్రాసులేని ఆంధ్ర రాష్ట్రంలో మేముండబోమంటున్నారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ పెద్దలు అధికార

ప్రాబల్య వ్యామోహంతో ఎటూ మాట్లాడకుండా నోళ్లు కట్టిపెట్టుకున్నారు. ఆంధ్రులు మద్రాసుపై హక్కును వదులుకుంటే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌కు రాగల నష్టం లేక పోవచ్చును; కాని ఆంధ్ర ప్రజానీకానికి తీరని నష్టమనక తప్పదు; పైగా ఆత్మాభిమానానికి గొడ్డలిపెట్టు.

ఇంచుమించుగా పాకిస్థాన్ ఏర్పడటం వలన పాకిస్థాన్ ఉద్యమంలో పనిచేసిన పాకిస్థానేతర ముస్లిముల పరిస్థితులేవో సాంస్కృతికంగా, భాష, విజ్ఞాన వికాసాల అభివృద్ధి విషయాలలో మద్రాసునగర ఆంధ్రులకుకూడ ఆ పరిస్థితులే అమరుతవి. కాబట్టి నగరంలో ఆంధ్రులకు నగర భవిష్యత్తు నిర్ణయపు ప్రధాన భాగాన్ని వదలాలి.

ఆంధ్రజాతి నేటికైనా కళ్లు తెరచి తమవ్యక్తిత్వానికి ఆత్మగౌరవానికి లోటు లేకుండా వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా ఆంధ్రరాష్ట్రనిర్మాణ సందర్భంలో పనిచేయాలి. ఈనాడు తాము సలిపే పోరాటం, జరిపే నిర్ణయాలు ముందురానున్న తరతరాల వారి శ్రేయస్సుకు, అభ్యుదయానికి తోడ్పడాలనే విషయం మరువకూడదు. ఇందుకుగాను ప్రతి ఆంధ్రయువకుడు, యువతి నడుం కట్టి పనిచేస్తేనేకాని సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగదు. అందుకుగాను ప్రజలలో ఐక్యమత్యం, కార్యదీక్ష, నిర్మాణకార్యక్రమం ఎంతైనా అవసరం.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సందర్భంలో మద్రాసు నగర భవిష్యత్తును గురించి రెండేమార్గాలు – తమిళ ఆంధ్ర ప్రాంత్యాలుగానైనా విభజించ బడాలి; లేదా ప్రత్యేకంగా కమీషనరు రాష్ట్రమైనా ఉమ్మడి నగరం ఏర్పడాలి. ఇవే న్యాయమైన మార్గాలు. వీనికొరకు నిర్మాణాత్మకమైన కృషి, పార్టీ, వర్గరహితమయిన శాంతియుత పోరాటం కంటె మరేమార్గం లేదు.

—(o)—

# మనస్పర్ధ

ప్రశాంతమైన సాయం సమయమది. సుమధుర కలకలారవాలతో వీడ్కోలు నిస్తున్నవి. వృద్ధ భానునకు ద్విజసంతతులు. తప్పిపోయిన కుమారుణ్ణి చిరకాలానికి కనుగొంబోయే తల్లిలోని యాత్రుతను తొణికిస లాడించుకుంటూ తన అరుణారుణ హస్తాలను చాచింది పశ్చిమ దిశకాంత వృద్ధభానుని కొరకు. ఆ చేతుల యెఱ్ఱదనంచే లోకమంతా రక్త సముద్రంలో మునిగి తేలుతూన్నట్లుంది. ప్రశాంతంగా వున్న ప్రతి ప్రాణి హృదయంలోనూ సంతోషానికీ విచారానికీ భిన్నమైన ఒక భావాన్ని నింపుతూన్నట్లున్నదా సమయంలోని ప్రకృతి. ఏదియేమైనా ఒక అనిర్వచనీయానందాన్ననుభవిస్తూందా గ్రామప్రజ. కాని వీటినీ వేటిని పట్టించుకోనట్లు సంతోషమయ ప్రపంచాన్ని పూర్తిగా వెలివేసిందా గ్రామంలోనే వున్న ఒక పెంకుటిల్లు.

అది ఒక చిన్నయిల్లు. దానిని చూడగానే ఆ గృహయజమాని కొంచెం కలవాడే ననిపిస్తుంది. ఆయింట్లో ఒక చిన్న గదిలోనుండి మూలుగు వినపడుతూంది. మంచంలో పడుకున్న శక్తిలేని ఒక బాలిక ముఖగహ్వరాన్నుండి వెలువడే శబ్దపరిణామం కాబోలీ మూలుగు. ఆ బాలిక చుట్టూ బంధుమిత్రులు గుమిగూడారు. అందరి ముఖాల్లోనూ విచార దేవతాపదవిన్యాసం కానవస్తూంది. అప్రయత్నంగా అందరికళ్ళల్లోనూ కన్నీరు సుళ్ళు తిరుగుతున్నవి. అవునుమరి! ఒక ముక్కుపచ్చలారని ముద్దు బాలిక యితరుల మధ్యగల మనస్పర్ధల మూలంగా తన నిండు ప్రాణాన్ని బలిపెడుతూంటే యేప్రాణి జాలితో మునిగిపోదు? ఏ జీవిహృదయం సానుభూతిలో నిండిపోదు?

అసలు లక్ష్మయ్యది కొంచెం కల కుటుంబమే, ఒక్కగా నొక్క కూతురతనికి. ముద్దు మురిపాలతో పెంచుకుంటూ కుమార్తె ఆనందంలో స్వర్గాన్ని, ఆటల్లో అమరత్వాన్ని కనుగొన్న తండ్రి అతఁడు. ఆవూళ్ళోనే వున్నాడు రామారావనే డాక్టరు. ఆపల్లెటూరికంతా వైద్యుఁడుగా అతడొక్కడే శరణ్యం. అయినా కడీ యేడమా అనకుండా తన శాయశక్తులా సహాయం చేసే బీదల పాలిటి కల్పవృక్ష మనవచ్చతడిని.

చిన్నప్పటినుండీ లక్ష్మయ్య, రామారావు లొక తల్లి బిడ్డల్లా మెలిగేవారు. ఆట పాటల్లోగాని, ఆహార విహారాదుల్లోగాని మనసు లొకటిగా శరీరాలు భిన్నంగా సంచరించే స్నేహితులు వారిరువురూ.

కాని కాలచక్రం పరిభ్రమిస్తున్నకొద్దీ వారిలో మార్పు రాసాగింది. స్నేహము, ప్రేమ అనే వాటి నర్ధం చేసుకొని వాటిని తమ జీవితపు చరియల్లో నిండింపఁ జేసుకొన్న ఆపసిహృదయాలు కాలం గడిచినకొద్దీ వర్షా నదులవలె అప్రసన్నములయినవి. కారణం లక్ష్మయ్య వంశ పారంపర్యంగా వస్తూన్న వ్యవసాయాన్నాదరించి పూజిస్తుంటే రామారావు డాక్టరు హోదా సంపాదించి లోకం దృష్టిలో గౌరవ నీయుఁడు కావడం. అమాయకంగా జీవితంలోవున్న ఒడుదుడుకులను లెక్క చెయ్యకుండా చెయ్యీ చెయ్యీ కలుపుకుని స్నేహ సాగరాన్ని చేరే సెల యేళ్ళలాగున్న వారిబ్రతుకులకీ 'హోదా' ఒక అఖాతమై కూర్చుంది.

ఒకసారి రామారావు బహిరంగంగా లక్ష్మయ్యను గూర్చీ వ్యవసాయాన్నిగూర్చి హేళనగా తూలనాడాడు. ఆత్మగౌరవాన్ని రూపొందించుకొన్న లక్ష్మయ్య రామారావుని తిరస్కరించాడు. దానితో ఆయింటిమీద కాకి యీయింటిమీద వాలకూడదన్నంత కట్టుదిట్టాలేర్పడ్డవి వారిరువురి మధ్యా.

ఇప్పుడు లక్ష్మయ్యస్థితి సందిగ్ధములో నున్నది. రామారావూరికంతా ఒక్కడే డాక్టరు. తన ముద్దు కుమార్తె చూస్తే అపాయకరమైన విష జ్వరం వల్ల మరణించనున్నది. అట్లని తన కూతుర్ని రక్షించుకోవడాని కాత్మాభిమానాన్ని ఒదులుకోవడమా? కాదని కానక గన్న కుమార్తె నిండుప్రాణాలని నిర్లక్ష్యం చెయ్యడమా? పోని పట్టణాన్నుండి మరియొక వైద్యుణ్ణి తెద్దామంటే యెంతలేదన్నా మూడుపూటల

# స్త్రీ స్వాతంత్ర్యం

శ్రీ జరుగుబిల్లి
సాంబశివరావు

'ఓ భారత నారీమణులారా! ఓ సోదరీ మణులారా! మనకు కావల్సింది ఒక్కటే. అదే స్త్రీస్వాతంత్ర్యం! ... మనంగూడ మనుష్యులమే. మనంగూడ జీవులమే. మనకూ బొండి, బొందిలో ప్రాణాలు ఉన్నాయి' అని నిర్మల అనేసరికి సభలో ఒక్కసారి హర్షధ్వానాలు మిన్నుముట్టినై.

ఒక్కసారి బల్లగుద్ది "సైలెన్సు! సైలెన్సు! ఈ పురుషులకు స్త్రీలంటే అంత అసహ్యంగాఉంది. 'స్త్రీఅంటే ప్రాణంలేని బొండె' అని వీరి అభిప్రాయం. ఎలా పడితే అలా పురుషునిచేతిలో ఆడే కీలుబొమ్మ అని వారి ఉద్దేశం. తమదే పైచేయి అన్నివిధాలా....."

"దాన్ని మనం సహించలేము-సహించం-సహించగూడదుకూడ. మనకూ స్వాతంత్ర్యంఉంది. మనమూ పురుషులతో సహా భారతమాత కడుపునపుట్టిన వారమే."

"ఇదిగో! ఓసోదరీ మణులారా! ఒక్కటేమాట - పురుషులు ఏమైనా మనపైన దౌర్జన్యాలుసాగిస్తే ప్రతిస్త్రీ ఎదుర్కోవాలి-ఎదిరించాలి-బెదిరించాలి- భర్త పెడత్రోవ త్రొక్కితే భర్తను సరిదిద్దే అధికారం ప్రతి స్త్రీకిఉంది. ప్రతిస్త్రీ తనభర్త పెడత్రోవ త్రొక్కితే సహించకూడదు.ఎదుర్కోవాలి-ధిక్కరించాలిగూడ సమయంవస్తే."

"భార్యాభర్తలు కలసిమెలసి ఉండాలి అన్యోన్యప్రేమతో. ఆనాడే మనకు శాంతి. ఆనాడేసుఖం.....ఆనాడే సౌఖ్యం....."

అని ఒక్క దీర్ఘోపన్యాసం ఇచ్చేసరికి అందరూ హర్షధ్వానాలు చేసేరు- "మహిళా మండలికి జై. నిర్మలాదేవికి జై" అనే హర్షధ్వానాలు మిన్నుముట్టినై—

అంతటితో మహాసభ ముగిసింది.

* * *

సరిగ్గా గోడగడియారం 8 గం॥ కొట్టింది. ఆనందరావు "నిర్మలా! ఏదీ కాఫీతీసుకురా" అన్నాడు న్యూస్‌పేపరు చదువుతూ.

నిర్మల కాఫీతీసుకువచ్చి ఎదురుగా నిలబడింది.

"చూశావా! నిర్మలా! ఈవైపరీత్యం! ఈమహిళామండలివాళ్లు చూడగా చూడగా మాకొంప పీకేటట్లున్నారు. పురుషులతో యుద్ధానికే వస్తారు కాబోలు!" అన్నాడు పేపరు చదువుతూ.

"అవును. నిజమే....మరి. మగాళ్ల నడవడి బాగులేకపోతే ఏంచేస్తారు మరి. మీకు తాళం? మీకి చూపెడతారా....?"

"ఓహోహో! బలేబాగుందే! నువ్వు చెప్పేది...ఈ ఆడవాళ్లు ఏదో ఇంతతిని... పడుకోడం మానేసి మీటింగులూ....రిజల్యూషన్లూ,...ఆఁ."

"అవునండీ. ఏంచేస్తారు మరి...నిజంగా మీమగవారు ఎన్నివిధాలుగా మాఆడవార్ని హీనంగా చూస్తున్నారు...అన్ని విధాల బాధిస్తున్నారు. ఏంచేసినా ఎంత కాలం సహించి ఊరుకొంటాము? అనేసరికి వీధిలోనుంచి "ఆనందరావు గారు" అంటూ పిలుపు వినబడింది...

వెంటనే ఆనంద్ పైకివచ్చి తలుపుతీసేడు.

"మీరు తప్పకుండా సాయంత్రం రావాలి సుమండీ! మా సెట్టిగారు ప్రత్యేకంగా మీతో చెప్పమన్నారు. నిజంగా పద్మడాన్సు ఏమిటండీ....అద్భుతంగా ఉంటుంది' ఒక పెద్దమనిషి ఇన్విటేషను ఇచ్చిపోయాడు.

సాయంకాలం ఆనంద్ మిస్. పద్మ డాన్సుకి వెళ్లి, వచ్చి, రాత్రిపడుకున్నాడు— రాత్రి 10 గంటలయింది. ఇంకా నిద్దుర పట్ట లేదు.

"ఏం, ఒక్కసారి దానింటికి వెళ్లినంత మాత్రాన్న తప్పేమిటి?"

"అదీకాక నిజంగా...పద్మఅందాలరాశి, ...నిండు యౌవనవతి....సౌందర్య స్వరూపిణి...రూపవతి...నిజంగా ఆమెతో ఆప్రణయ సామ్రాజ్యంలో తన్మయం చెందడం కంటె ఇంకొకటి ఏంకావాలి మనకి?"

"ఛా. ఛా...సానింటికా వెళ్లడం... మనం ఇంతో అంతో ఉద్యోగం చేసుకుంటున్నాము. గౌరవంగా జీవనం సాగిస్తున్నాం-మనం అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యఉంది...ఇంతకన్నా చిన్నతనమైనపని ఇంకొకటి ఉందా..."

చివరకి వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు.

ఆ మర్నాటినుంచీ ఆనంద్ రోజూ పద్మ ఇంటికి వెళ్లడం అలవాటైపోయింది. భార్య ఊసే తలపెట్టడంలేదు. తరచుగా నిర్మలతో మాట్లాడడమే మానివేశాడు.

ఒకరాత్రి 11 గంటల సమయం చరచరా ఆనంద్ గదిలోనుంచి వచ్చి వీధి తలుపులు తీస్తున్నాడు.

నిర్మల ఇదంతా కనిపెడుతూనే ఉంది. ముఖం విచారాన్ని సూచిస్తూంది. అశ్రుజలధారలు వడివడిగా ప్రవహిస్తున్నాయి. వెంటనే అడ్డుగా నిలబడింది ఆనందుకు.

"లే అడ్డం" అంటూ దమాయించుకొని, నిర్మలను క్రిందికి తోసేసేడు. తాను పైకి వెళ్ళిపోయేడు.

నిర్మల విచారానికి అంతులేదు. అలా ఆలోచిస్తూ పడుకుంది ఆరాత్రి. ఆరోజు తాను అన్నమాటలు ప్రతిధ్వనిస్తున్నాయి చెవిలో.

"భర్త పెడత్రోవత్రొక్కితే, భర్తను సరిదిద్దే అధికారం ప్రతి స్త్రీకి ఉంది."

చెవిలో ఆ ప్రతిధ్వని అధికమైపోతూంది. "సరే మన ప్రయత్నం మనం చేద్దాం" అనుకొని నిద్రపోయింది.

ఆమర్నాడునుంచి ముందుగా తానే ఆనంద్తో మాటలాడడం మానేసింది. అసలు ఎదురుగా కనబడడమే మానేసింది.

"ఏం భోజనం పెట్టడం లేదేమిటి?" అన్నాడు ఆనంద్, ఒకనాడు మధ్యాహ్నం.

"ఇవాళ వంటలేదు!" "ఏం వండక ఏం చేస్తున్నావు?"

"ఒంట్లో బాగులేదు."

"ఏడ్చినట్లే ఉందిలే! తిండితినకపోతే ఎలా అఘోరించమన్నావు?"

అని కోపంతో ఆనంద్ పైకిపోయాడు.

ఇక, ఆరోజునుంచీ ఇంట్లో వంటైనా చేయడం మానేసింది. ఇదంతా ఎందుకు పాపం! తన భర్త తనకు స్వాధీన మవుతాడని, కాని ఆమర్నాడునుంచీ ఆనంద్ ఇంటివైపే చూడ్డం మానేశాడు. తన టైము అంతాగూడ పద్మతోనే గడపడం మొదలెట్టేడు.

కొన్నాళ్లు గడిచింది.

ఆనంద్‌కు క్షయవ్యాధి ప్రవేసించింది. మనిషంతా చిక్కి శల్యమయేడు. అప్పటిదాకా ఆనంద్ అంటే ప్రేమతో ఉన్న పద్మకు ఆనాటితో అనంద్ అంటేఅసహ్యం పుట్టింది.

"క్షయవ్యాధితో గూడ మమ్మల్ని చంపుతావేమిటి? పో! నీపెళ్ళాం దగ్గరకు." అంది. కోపంతో.

"పెళ్ళాం ... ఇంకెక్కడి పెళ్ళాం ... ఆనాడే దానికీ, నాకు సంబంధం తీరిపోయింది. పద్మ ... అంతా నువ్వేగా ..."

"ఛీ, నీకూ నాకు సంబంధం యేమిటి? నిన్ను నేనేం పెళ్ళిచేసుకొన్నానా? నీవు నాకు డబ్బిచ్చి నంతకాలం ప్రేమించేను, నీవు ఆరోగ్యంగా ఉండేవాడివి కాబట్టి నీతో ఉండేదాన్ని..."

"ఇంతకీ నీతో బాటు ఆరోగంతో నన్ను గూడ చావమన్నావా? ఇప్పుడు నువ్వు ఇక్కడ ఒక్క-రోజయినా ఉండడానికి వీల్లేదు. పోతావా? పోవా ..."

"ఇంతేనా ... పద్మా .. పద్మా ..."

"ఇంతేకాకపోతే మరేమిటి? పో."

ఆనంద్‌కు మతిపోయింది. ఏంచేయడానికి ఏమీ తోచలేదు. నమ్ముకున్న పద్మ ఇలా చేసింది. ఇక, తన భార్య చూస్తుందా ...? మెల్లిగా చేరాడు ఇంటికి.

"నిర్మలా ... నిర్మలా ... క్షమించు .. నన్ను క్షమించు...నీకు తీరని అన్యాయం చేసేను ... నన్ను క్షమించవూ" అని ప్రాధేయ పడ్డాడు.

నిర్మల, ఆనంద్‌ను చూసి ఎంతోకాలం అయింది. ఎప్పటికైనా తిరిగి వస్తాడా అని వర్షపు నీటికి, ముత్యపు చిప్పలాగ కనిపెట్టుకొని ఉంది.

వెంటనే చూసింది ఆనంద్‌ను, కన్నీటి తరంగాల్లో ఊగులాడుతూ, "మీరేనా...? ఏం ఇలా అయిపోయారు..?" అని ఒక్కమారు కౌగలించుకుంది.

వెంటనే ఆనంద్‌ను హాస్పటల్ లో చేర్పించి, చికిత్స చేయించింది. ఆనంద్ జీవించేడు.

ఇద్దరూ సుఖంగా ఉన్నారు.

o

# పూజ్య శ్రీ కేసరిగారితో నా పరిచయం

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

"క్రియా సిద్ధిస్సత్త్వేభవతి
మహతాం నోపకరణైః"

ఆధునికాంధ్ర దేశాభివృద్ధికి మూల పురుషులనదగిన మహా పురుషులలో శ్రీ కేసరిగారొకరు. ప్రథములు శ్రీ కందుకూరి వీరేశలింగము గారినిగూర్చి ఎవరు వేరేచెప్ప నక్కరలేదుకదా! ఇంకొకరు స్వర్గీయులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారు. సర్వతోముఖమైన, సర్వంకషమైన, సర్వాంగీణమైన దేశసేవచేసి ఆ భవ్యులు దివ్యులైనారు. వర్తమాన యుగంలో ఆ శ్రేణికిచెంది దేశాభివృద్ధికి పాటుపడ్డ మహామహులెవరయ్యా అంటే శ్రీ కేసరి గారొక్కరే మనకు సమాధానంగా లభిస్తారు.

అంతే కాకుండా వీరి మువ్వురకూ సమాన సౌమ్యంగా చెప్పదగిన ఒక మహా లక్షణం వీరి మువ్వురనూ ఒక శ్రేణికి చేరుస్తూంది. అదేమంటే వీరు మువ్వురూ లోకసేవ చేస్తూనే అతి సామాన్య జీవితంలోనుండి స్వప్రయత్నంవలననే అతిశయ మహైశ్వర్యాలు సముపార్జించడమేకాక, ఆ మహా సంపదల నన్నింటినీ తిరిగీ లోకసేవలోనే వినియోగించి ఆదర్శప్రాయులైనారు. అంతేకాదు ముగ్గురూ సంస్కారులు, ముగ్గురూ పత్రికాధిపతులు, ముగ్గురూ, నిస్స్వార్థ జీవనులు, ముగ్గురూ నిజంగా పరహితాభిలాషులు.

అందుచేత ఈ మూర్తిత్రయం నిజంగా ఆంధ్రులకు ఆరాధనీయమైన మూర్తిత్రయమంటే అతిశయోక్తి యేమీలేదు.

అయితే శ్రీ కేసరిగారిలో ఇంకో గొప్ప ముఖ్య విలక్షణ లక్షణం ఏమంటే వారు స్త్రీ జన సాహిత్యోద్ధరణకు కంకణం కట్టడమే. శ్రీ వీరేశలింగంగారు కూడా స్త్రీలకు పునర్వివాహాది సంస్కారాలు ఆచరణలోకి తీసుకొని రావడమే కాకుండా వారికొఱకు పత్రికకూడా పెట్టి ప్రచారం చేశారు. కొందఱు కవయిత్రులనుకూడా తయారుచేసి దేశానికి ఉత్తమ కవయిత్రులను ప్రసాదించారు. కాని వారి కాలంలో కంటెకూడా నాగరకత ప్రబలి, పత్రికా యుగమని చెప్పదగిన యీ కాలంలో, కేవలమూ విస్మృత సాహిత్యంగా జనసామాన్యంచేత అనాదరణతో నిర్లక్ష్యం చేయబడుతూన్న స్త్రీ జన సాహిత్యాభివృద్ధికొఱకు పాటుబడుతూన్న పురుషుల సంపాదకత్వంతో ఒక ఉత్తమమాసపత్రిక ఉదారాశయాలతో ప్రకటింపబడుతూంది. అంటే ఆ నిర్వహణ అమూల్యమైనదన్న మాట వేరే వ్రాయనక్కఱలేదు. ఇప్పట్లో మనకేసరిగారి గృహలక్ష్మి వలననే స్త్రీలలో వాఙ్మయ సంచాలనంకాని, సాహిత్యాభివృద్ధికాని ఎక్కువ కల్గిందని నేనంటే అది సత్యేతరం కాజాలదు.

'కేసరిగారు ఒక మహాపురుషుల'ని గృహలక్ష్మిని చదవడం మొదలు పెట్టిన నా బాల్యంనుండీకూడా ఒక అభిప్రాయం మెఱుపులాగ నా హృదయంలో తళుక్కుమంటూండేది. ఎందుచేత? అని నాలో నేనే చాలామార్లు ప్రశ్నించుకొన్నాను. కాని నాకు సమాధానం తొందరగా సులభంగా దొరకలేదు.

ఈలాంటి మనస్స్థితిలోనే ఒకప్పుడు అనగా సుమారు 7, 8 సంవత్సరాల క్రితం అనుకోకుండా వారింట్లో నేను అతిథినైనాను. వారింట్లో ఇంచుమించు ఒక రోజల్లా ఉన్నా. నాకు వారిని చూడడమనేది రెండు మారులే తటస్థపడింది. ఆ నాడు ఉగాది; అంతకు క్రితం రోజుననే వారిచే ఆహ్వానింపబడి ఆ నాడు నేను వా"రింటి విందనైతిని." ఆ నాటి వారిముక్తసరి సంభాషణ నా భావనలో వారిని గంభీరులుగా ముద్రాంకితం చేసింది. దేశసేవకులను, మహాపురుషులనూ చూడాలనే ఉత్కంఠతో సుదూర ప్రయాణాలుచేసి వెళ్లేనా ఉబలా

టానికి; కేసరిగారితోటి ఈ కొద్ది పరిచయానికి ఏమాత్రం తృప్తి కలుగలేదు; సరికదా - అది వకటి నాభావానికి ఏమీ వ్యతిరేకత కలుగక పోయినా - విపరీత ఆలోచన మాత్రం హెచ్చైనది. "వీరిని నేను చిన్నప్పటినుండీ మహా పురుషులుగా భావించడానికి వీరిలోగల ప్రత్యేక లక్షణం ఏమిటి?" అనేదే ఆ విపరీత ఆలోచన - ఏలాగైతేనేం నా ఆందోళనను శతగుణితం చేస్తూనే కేసరిగారితో ప్రథమ పరిచయాంకం ముగిసిపోయింది.

కాలం ఇలా దొరలిపోతూ ఉన్నది. ఇంచుమించు శ్రీ కేసరిగారి ప్రత్యేకతను గూర్చిన నా ఆలోచన నిద్రాభి ముద్రితమైందనే చెప్పాలి.

అయితే ఇటీవల - వాసనాత్మకంగా నా చేతనలో లీనమైయున్న - ఈ సంకల్పం మళ్లీ సజీవ సంస్కారాత్మకంగా ఉద్బుద్ధం కావలసిన సంఘటన ఒకటి జరిగింది.

మన మద్రాసు గవర్నమెంటువారు పెట్టిన గ్రంథ రచన పోటీలో ఒక అంశమైన "ఆంధ్ర కవయిత్రులు" అనే గ్రంథాన్ని వ్రాయడానికి నేను సాహసించాను. అప్పుడు మన సతీమ తల్లుల సాహిత్య కృషి ఎట్లా జరిగింది అనే పరామర్శ బుద్ధితో ఇప్పటికి పాతికేళ్లబట్టీ ప్రకటింపబడిన, ప్రకటింపబడుతూన్న పత్రికలన్నీ సంపుటాలు సంపుటాలుగా హిందూ సుందరి, గృహలక్ష్మి, అనసూయ, జనానా, భారతి, శారద, సావిత్రి, ఆంధ్రభూమి, ఆంధ్ర మహిళ మొదలైనవి తెప్పించి ఆనుపూర్వికంగా చదువుతే నాకు లభించిన స్త్రీ వాఙ్మయం నాలుగింట మూడుపాళ్లు గృహలక్ష్మిలోనే లభించింది.

మగవాళ్ల సాహిత్యానికే ప్రచురణకు దిక్కూదివాణంలేని ఈ రోజుల్లో అబలా సాహిత్య వృద్ధికి అంతగా శ్రీ కేసరిగారెందుకు శ్రమపడాలి? స్త్రీల చేతనే నడుపబడిన జనానా, అనసూయ మొదలైన పత్రికలకంటే కేసరిగారి సంపాదకత్వం ఎక్కువ స్త్రీ సాహిత్యాన్ని ఎందుకు సృష్టింపగల్గింది? అంతేకాక స్త్రీల అనేక కావ్యాలను, పుస్తకాలను కేసరిగారు ఎందుకు ముద్రింపిస్తూన్నారు? ప్రోత్సాహంకోసం స్త్రీలకు స్వర్ణకంకణా లెందుకిస్తున్నారు? దీనివలన వీరికికలిగే లబ్ధిఏమిటి? కీర్తి కాదా? అటువంటప్పుడు వారి కెందుకీ తాపత్రయం? ఎక్కడో ఎవ్వరికీ కనబడని, ఎవ్వరికీ ఇంతవఱకు అక్కఱలేని తరిగొండ వెంకమాంబ భాగవత ద్విపదను శ్రీ కేసరిగారు మాత్రమే ఎందుకు ఉద్ధరించి వారి గృహలక్ష్మిలో ప్రచురించారు? ... ఇట్లా అనేక ప్రశ్న పరంపరలు నా ఊహల్లో సుళ్లుతిరిగిపోయినపుడు చిన్నప్పటినుండీ నన్ను వేధిస్తూన్న గ్రంధి ఒక్కమాఱుగా విరిసిపోయి నాకు చాలా సంతోషం కల్గింది. అప్పుడు బోధపడింది శ్రీ కేసరిగారి మహానుభావుకత! అనేక కష్టనష్టాలకోర్చి అనేక స్త్రీ రచయితలను ప్రోత్సహించి, ఆదరించి, సత్కరించి, స్త్రీల అభ్యున్నతికీ, అభిరతికీ పనికి వచ్చే అనేక ప్రత్యేక శీర్షికలు నూత్న నూత్నంగా సృష్టించి పత్రికను రమణీయంగాను, ఆకర్షణీయంగాను తీర్చి దిద్దారు. మొదటినుండీ గృహలక్ష్మిని పరిశీలించగా పరిశీలించగా నేను తెలుసుకోగల్గిందేమంటే "ఈమెలో కవిత్వకళలేదే? ఈమె యెందుకు పద్యాలు వ్రాస్తూ ఉన్నదబ్బా?" అని ప్రాథమిక స్థితిలో అనుకోవలసిన రచయిత్రులు కాలక్రమేణ సుందరభావ ప్రపూర్ణములైన కావ్య సుమమాలలు గ్రువ్వగల్గిన ఉదాత్త కవయిత్రులు కాగల్గిన క్రమపరిణామం గృహలక్ష్మి పరిశీలనలో నాకు గోచరించింది. ఎందుకూ పనికిరాని రచనలనుకూడా ప్రోత్సహించి, ఆదరించి వాటికి పత్రికలో తావిచ్చి ప్రచురించి ప్రపంచపు వెలుగు చూపించిన శ్రీ కేసరిగారి మహౌదార్యమే ఈ క్రమ పరిణామానికి కారణం అంటే ఎవరైనా కాదనగలరా?

ఐతే "ఇదంతా లోధ్ర ప్రచారం కోసంలే!" అని చుల్కనగా నోరు పారేసే మనుష్యులు కొంత

మంది లేకపోలేదు. కాని తమ తమ వ్యాపారాల్లో ఎక్కువ డబ్బు గడించదలచిన వారంతా ఇట్లా పత్రికలు పెట్టి సంఘసేవకూడా చేశారా? ఏదో ఒక్క శ్రీ నాగేశ్వరరావుగారూ ఒక్క శ్రీ కేసరిగారూ తప్ప! యుద్ధ సమయంలో శ్రీ కేసరిగారు కొన్నాళ్లు గృహలక్ష్మి ప్రచురణ నిలిపివేశారుకదా? వారి లోధ్ర ఎలాగూ ప్రచారంలోకి వచ్చింది కదా? "పాతబడ్డ ప్లీడర్లు బోర్డు వేసుకోవడం మానివేసినట్లు" ఇంక ఊరుకోగూడదూ? మళ్లీ గృహలక్ష్మి ప్రచురణ మొదలుపెట్టారెందుకు? అని ఆలోచిస్తే ఆ ప్రశ్నలకు సమాధానం ఒకటే. గాలి పీల్చడమూ నీరు త్రాగడమూవలె సంఘసేవకూడా, మానివేసి ఊరుకోలేనంత సహజ గుణంగా వారికేర్పడి పోయిందన్న మాట. అందుకే భర్తృహరి అన్నాడు:- "జగతి నుపకర్తలకు నిది సహజగుణము." ఈ సహజ గుణంయొక్క ఆంతరంగిక రూపం సంకల్పం మాత్రమే ఐతే బాహ్య స్వరూపాలు, గృహలక్ష్మి మైలాపూరులోని వారి ఆంధ్ర పాఠశాల అయ్యాయి.

గృహలక్ష్మిలో కొన్నాళ్లు వారు ప్రచురించిన "నాచిన్ననాటి ముచ్చట్లు" చదివినపుడు వారి అకృత్రిమ స్వభావము, అవికత్థనతా, నిరాడంబరతా, అర్థం చేసుకొన్నప్పుడూ, తరువాత నా ఆంధ్ర కవయిత్రుల రచనా సందర్భంలో గృహలక్ష్మి పత్రికా ప్రచురణం ద్వారా శ్రీ కేసరిగారి మహోదాత్తత గ్రహించగలిగినపుడూ నాకు కలిగిన ఆనందం శ్రీ కేసరిగారిని నా భావనలో మహా పురుషులుగా స్థిరముద్ర వేసింది.

ఇంత గ్రంథం జరిగిన తర్వాత ఆనందోత్ఫుల్లమైన మనస్సుతో ఉరకలుపెడ్తూ ఈ నడుమ ఒకనాడు మళ్లీ వారిని దర్శించాను. ఆ నాటి సమావేశం ఎంత ఉదాత్త రమణీయమైనదో అంత సుస్నేహ రుచిరమైనది. ఎంత స్వభావ మనోహరమైనదో అంత అకృత్రిమ మనోజ్ఞమైనదీ అయి నా భావంలో ఒక స్థిరరూపాన్ని పొదుకొల్పింది.

ఆ నాటి శ్రీ కేసరిగారి సంభాషణ నాకు ఎంతో ఆత్మీయంగా కనబడడమే కాకుండా ఎంతో ఉత్తమ సంస్కార పూరితంగాకూడా ఉన్నది. ఆ కొద్దిసేపట్లో సాగించిన మా సంభాషణలో అనేక విషయాలు దొరలినవి. వర్ణాశ్రమ వ్యవస్థమీద, స్త్రీ సంఘాలమీదా, స్త్రీ సంఘాలు స్థాపించి దేశాన్నంతా ఉద్ధరిస్తూన్నామని బింకాలుపలికే నేటి కాలపు కొందఱు నాయకురాండ్ర కల్మష మనప్రవృత్తులమీద, స్వార్థపరురాండ్రై సంఘాన్ని చీడపురుగుల్లా తినివేస్తూకూడా సంఘాల్లో నిజంగా శక్తి, సామర్థ్యము ఉండే వాళ్లను ఎక్కరానీయకుండా కుహకాలు, కుతంత్రాలూపన్ని సంఘపతనానికి దారితీసే వ్యక్తులమీద, ఆంధ్ర దేశ పరిస్థితులపైనా, ఆంధ్రభాషా పోషణపైనా వారికిగల యథార్థాభిప్రాయాలు, స్థిరమైన కల్పనలు ఆకళింపు చేసికొని నేను పరమాశ్చర్య భరితురాలనైనాను. వారి సుస్నిగ్ధభావ వైశాల్యం అపారం అని తెలిసికొని మఱింత ముగ్ధురాలనైనాను.

నిజంగా కేసరిగారివంటి స్వయం సమర్థులూ, పరహితమతులూ ఐన మహా పురుషుణ్ణి ప్రసవించి ఆంధ్రమాత ధన్యాతి ధన్యురాలైంది.

స్త్రీ జనులకు ఆత్మ బంధువూ, ఆత్మీయులూ ఐన శ్రీ కేసరిగారు శతజీవులై, సహస్రజీవులై వారి ఆదరణ సౌభాగ్యంతో దేశాన్ని చిరంగా, స్థిరంగా ఋణపడుచుకోవాలని ఆశిద్దాం. మనం అంతా కరుణాళుడైన పరమేశుడుకూడా అలాగే అనుగ్రహించునుగాక అని అంజలిద్దాం.

రేడియో నాటిక

# నైజగుణం

ఏకాంకిక

శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

భూష:-మీరు మీపనిచేసుకోండి. నేను వెళతాను. నాకు క్లాసు వేళయింది.

నాగా:-చిత్తం చిత్తం! (భూషణం వెళతాడు)

ఓరి నాగన్నలారా! మీలో ఒకళ్లకీ సింహం చిట్టెలుక కధ రాదట్రా! అది పసి పిల్లలకి, పాలుతాగే పిల్లలకి, బొడ్డూడని వాళ్లకి కూడ తెలుసు కదట్రా! తెలివి తక్కువ దద్దమ్మలారా! దేనికైనా మిమ్మల్ని నమ్ముకొంటే గోదావరి ఈతకి కుక్కతోకని నమ్ముకొన్నట్టేనట్రా! శివ శివ!

[ఔట్ బెల్ కొడతారు]

మీరంతా బయటికి పోయి, మళ్లీబెల్ కొట్టేక లోపలికిరండి. (పిల్లలు వెళతారు) ఇక్కడ తిష్టకుదిరింది. కాని 'గ్రాసం ఒకరిదైనా వాసం మనది కావాల'ని పెద్దలనుడి; ఆమోస్తరుగా మనం బడి మేనేజిమెంటు దక్కించుకొంటే, ఇక హరి బ్రహ్మాదులు వచ్చినా ఈచోటునుంచి కదపలేరు. ఒకరి ఆజ్ఞ ఉండదు. ఒకరి పెత్తనముండదు. ఒకరి భయముండదు. దీనికి తగిన పన్నాగం పన్నాలి.

మూడోరంగం

[కరణంగారి ఇల్లు. నాగరావు ప్రవేశిస్తాడు.]

నాగా:-అయ్యా కరణంగారూ! కరణంగారూ! కాస్త తలుపు తీయిస్తారా!

[లోపలినుండి కరణం 'ఆఁ ఆఁ ఎవరువారు?' అని జవాబు.]

నాగా:-మీబంధుకోటిలోని వాణ్ణి నేనే!

[లోపలనుండి కరణం 'ఎవరు నాగారావుగారా?']

నాగా:-చిత్తం చిత్తం!

కరణం:-(తలుపుతీసి) లోపలకి ఇలాగురండి!

నాగా:-చిత్తం! (అని లోపలకి వస్తాడు.)

కర:- ఏమిటి విశేషాలు నాగారావుగారూ!

నాగా -లోకంలో విశేషాలే లేకపోతాయా! తమరు, మనవాళ్లంతా క్షేమమేనా?

కర:-ఏదో ఇలాగు కాలక్షేపం చేసుకు వచ్చేస్తున్నాం.

నాగా:-మీబోటివాళ్లే అలాగంటే ఇహ మాబోటి అధమాధముల గతేంకావాలి!

కర:-అందరికి ఆపరమేశ్వరుడే ఉన్నాడు.

నాగా:-అని మనబోటి సాధారణుల ఆలోచన! మరికొందరి పెద్ద మనుష్యుల ఆలోచనో!

కర:-ఏమిటి సంగతులు చెప్పేరుకారు?
నాగా:-ఏమున్నాయి?
కర:-అయినా చెబుదురూ!
నాగా:-చెబితే మానం పోయె, చెప్పకపోతే ప్రాణంపోయె-అన్న సామెతలాగు వచ్చి పడింది.
కర:-మనలో మనమాట, ఏమిటి కథ?
నాగా:-ఏమిటి చెప్పమన్నారు. చెప్పడానికి నోరు రాకుండా ఉంది.
కర:-అయినా ఏమిటని?
నాగా: ఆభూషణంగారిని ఆజ్ఞ పెట్టేవాడు ఈముల్లోకాలలోను లేడా అని!
కర:-ఏమిటి! అంతమట్టుకు వచ్చింది, నిన్న మొన్నటివాడు!
నాగా:-అంతా ఇంతానా!
కర:-ఇహనేమి!
నాగా:-మీరు ఊరివారందరిని ఏవిధం గానూ బతకనియ్యకుండా ఉన్నారని ఎక్కడ పడితే అక్కడ డప్పు అక్కర లేకుండ చాటించేస్తున్నాడు.
కర:-ఏమిటి! అంత ప్రజ్ఞావంతుడయేడా! ఆరి పీని తస్సాతియ్యా!
నాగా:-అంతా ఇంతానా!
కర:-ఎందుకూ! ఇహవీడి అంతు కను క్కొంటాను. ఆరి దీనితస్సాతియ్యా! పోనీ ఏదో నలుగురి పిల్లలను పోగుచేసుకొని నాలుగు ముక్కలు చెప్పుకొంటూ పొట్ట పోషించుకొంటూన్నాడు, మన కెందుకు పోనీ అంటే ఇంత పెచ్చు పెరిగిపోయేడా! ఇంకేమి! చాలా బాగుంది. భేషుగ్గా ఉంది.
నాగా:-ఇది ఇట్లాగుండగా - బడి నాపేర ట్రాన్స్‌ఫర్ చేయిస్తానని నాదగ్గిరమూడు వందల రొక్కం వసూలుచేశాడు. చివరికి ఏమికొంపముంచుతాడో, ఏమో!
కర:-అదొకటా! బాకీ పత్రముందా పోనీ!
నాగా:-పత్రమంటూ ఉంటే ఇంక బడి మానేజిమెంటు ట్రాన్స్‌ఫర్ ఏమిటి నాబొంద! ఆపనిచెయ్యడాని కిది లంచ మన్నమాట!
కర:-చాల సొగసుగాఉంది. ఇంకేమి, చాల బాగుంది!
నాగా:-మరినాకు బడివేళయింది. సెలవిప్పిం చండి. పునర్దర్శనం చేస్తా. మళ్లీ ఎక్క డేనా అనేరు సుమండీ! కొంపలంటుకొ పోతాయి!
కర:-ఎంతమాట! వెళ్లండి పాపం మీరు చిక్కులలో ఉన్నారు. అప్పుడప్పుడు కాస్త కనబడుతూంటారు కదూ?
నాగా:-ఎప్పుడూ మీసన్నిధి నున్నట్టే! అక్కడ ఈపాడు జేనెడు పొట్టకోసం అరవచాకిరీ తప్పదు! తతిమా కాలం మీసాన్నిధ్యమందే!
కర:-వెళ్లిరండి మరి!
నాగా:-సెలవు.

(ఇద్దరూ వెళతారు)

[శీలశర్మ వస్తాడు.]

శీల:-అయ్యా! కరణంగారూ!

[లోపలినుండి కరణం 'ఎవరువారు?']

శీల:-నేనండి. శీలశర్మని.

[లోపలినుండి కరణం 'మీరా, వస్తున్నా' అని తలుపు తీస్తాడు.]

కర:-ఇలాగు కూర్చోండి శర్మగారూ! ఏమిటి విశేషాలు?

శీల:-ఏమిటో ఇట్లా గుంటున్నాము. అదే విశేషం.

కర:-అంతమట్టుకు బాగనే ఉంది. కొందరి లక్షణ మేమిటంటే వారు నిల్చున్న చోట మరెవరూ ఉండకూడదని పొట్లకి పొరుగు కిట్టదని, తుమ్మ ఓదరం కమ్మ ఓదరం అని సామెతలు.

శీల:-అంతటి సుగుణ వంతులు భూమి మీద ఉంటారంటారా!

కర:-ఇది అలాంటి వాళ్ళకే కాలం గాని నాబోటి అమాయకుడికి కాలం కాదండి శర్మగారూ! మరేమిటి విశేషాలు? మీ భూషణంగారు క్షేమంగా ఉంటున్నారా?

శీల:-మా భూషణంగారే కాని మీ భూషణంగారు కాదా ఏమిటి!

కర:-భూషణంగారికి బడిపని అంటే విరక్తి కలగడం లేదుకదా!

శీల:-పెద్దలు మీరు అలాగు అడుగుతున్నారు. నాకేమీ అర్థం కాకుండా ఉంది.

కర:-అబ్బే! నాకు తెలియక అడుగుతున్నాను.

శీల:-ఏదేనా విశేషముంటే నాచెవిని వెయ్యండి.

కర:-అబ్బే! నాబోటి వాడికేమి విశేషాలు తెలుస్తాయి. వారి తాబేదారులు మీబోటివారు చెప్తే వినడం తప్ప! కాల మహిమవల్ల వారి తాబేదారులు మరొకరి తాబేదారులు కావచ్చు.

శీల:-కరణంగారూ! మీరనే మాటలు నాకేమీ అర్థం కావడం లేదు. మీరు విశద పరిచే మాటంటే తెలుస్తుంది కాని లేకుంటే అగమ్య గోచరం.

కర:-నేను మొదటే చెప్పనే చెప్పేను, మీబోటివారు చెప్తేనే మాబోటివారికి తెలుస్తుంది. కాని మరొక మార్గం లేదని.

శీల:-చిత్తం చిత్తం! నాకు బడివేళవుతూంది. శలవిప్పించండి మరి!

కర:-మంచిది వెళ్ళిరండి. (శీలశర్మ వెళతాడు. కరణం ఇంటిలోకి పోతాడు.)

నాలుగోరంగం

[భూషణం ఇల్లు అతనిచేతిలో ఏదో కాగితముంటుంది.]

భూష:-ఇప్పుడే టపాలో వచ్చింది, డిప్యూటి ఇనస్పెక్టరుగారి ఆఫీసునుంచి కాగితం. గత మూడేళ్ల సాలుసరి పరీక్షల, తణిఖీల, ప్రమోషన్ల స్టేటుమెంటు అర్జంటుగా పంపమని. చూస్తే

ఈరోజున బడికి పండగ సెలవు. తిరుగు టపాలో జవాబు వెళ్లాలట! ఎలాగ? ఆనాగారావుంటే తత్క్షణం చిత్తు స్టేటు మెంటు వేసి- సాపుప్రతిరాసి ఈపాటికి పోస్టులో పడేసేవాడు. అతనికోసం కబురు పంపించుదాం పోనీఅంటే చేతిలో మనిషి లేకుండా వచ్చింది కర్మం.

[శీలశర్మ వస్తాడు]

శీల:-నమస్కారాలండి భూషణంగారూ!

భూష:-ఏమండిశీలశర్మగారూ! మంచిటైంకి చక్కా వచ్చారు. చేతిలో మనిషెవ్వరూ లేరే అని కంగారు పడిపోతున్నాను, మీరు రావడం దేవుడే దర్శన మిచ్చినట్లుగా ఉంది.

శీల:-ఏమిటి సంగతి సెలవియ్యండి.

భూష:-మరేమీలేదు, మీరు వెళ్లి నిల్చున్న పాటున మన నాగారావుని తీసుకురండి.

శీల:-ఇవాళ బడికి సెలవుకదా! మనిషి అసలు దొరుకుతాడా! ఎక్కడ పేకాటలో చిక్కుకొని ఉన్నాడో!

భూష:-అదంతా మనకెందుకు! నేను వేగిరం రమ్మంటున్నానని మీరుకాస్త అతనికి కబురు అందచేస్తిరా అంటే రెక్కలు కట్టుకు వచ్చి వాలుతాడు. లెండిమరి.

శీల:-సరే దానికేముందిలెండి. కాని ఆకాగితాన్ని మనమే నలుపుచేసి పారేస్తే తీరిపోతుందేమో!

భూష:-అది మనవల్ల అయేపని కాదండి శర్మగారూ! అతనే చెయ్యాలి ఆఫీసుపని చేస్తే ఆనాగారావే చెయ్యాలి. అఖండుడంటే నమ్మండి.

శీల:-అదికాదు కాని భూషణంగారూ! ఒక సంగతి మనవిచేస్తా. కాస్త ఆలకించండి.

భూష:-మీరు మొదట అతన్ని పిలుచుకు రండి. ఆతర్వాత బోలెడంత వేళ ఉంటుంది, తీరుబాటుగా కబుర్లు చెప్పుకొందాం. వెళ్లిరండిమరి

శీల:-చిత్తం వెళ్లివస్తాను.

(వెళతాడు)

భూష:-శీలశర్మకి నాగారావుకి ఒక్కక్షణం పడదు. అందుచేత అతనిమీద ఏవేవో చెప్పబోతాడు. వాళ్లూ వాళ్లూ ఏలాగు చస్తే ఎవడికి కావాలి. మనపని చేసిపెట్టినవాడే ఆప్తుడు. మొదట ఈకాగితం వెళ్లిపోవాలి, నామనస్సు కుదుట పడాలి.

[ఒక కుర్రవాడు వస్తాడు.]

కుర్ర:-అయ్యా టీచరుమేనేజరుగారూ! నమస్కారమండి!

భూష:-ఎవరబ్బాయి నువ్వు?

కుర్ర:-నేనొక బీదకుర్రవాడినండి బాబూ!

భూష:-ఏమిపనిమీద వచ్చేవు?

కుర్ర:-అయ్యా! నిన్నపొద్దుటినుంచి భోజనం లేక అల్లాడుతున్నానండి అయ్యా!

భామ: అయ్యో పాపం! మీతల్లి దండ్రు లెక్కడున్నారు?
కుర్ర:-తల్లిదండ్రులు లేరండి బాబూ!
భామ:-అయ్యయ్యో! పాపం! మరేమిగతి?
కుర్ర:-తమవంటివారిని ఆశ్రయించుకొని బతకడమే నాగతండి.
భామ:-నేనేమి కోటీశ్వరుణ్ణి కాను అబ్బాయీ!
కుర్ర -కోటీశ్వరులు దానం చెయ్యరండి అయ్యా!

వాళ్ల దృష్టి ఎంతసేపూ ఒకకోటిని రెండుకోట్లుగా ఏలాగు చెయ్యడం అని ఉంటుంది కాని దాన ధర్మాల మీద ఉండదు.

భామ:-బాగా చెప్పావు! నువ్వు తెలివైన వాడిలాగున్నావు అబ్బాయీ!
కుర్ర:-తమరు నాకు విద్యా దానం కూడ చేయిస్తారని ఆశపడుతున్నాను.
భామ:-నేను నీకు చేతనయినంత సహాయం చేస్తాను. నువ్వు మా ఇంట్లో భోంచేస్తూండు. మా బళ్లో చదువుకొంటూండు. తర్వాత సంగతి చూద్దాం.
కుర్ర:-చిత్తం చిత్తం! వీధిలో గోడపక్కని నాసంచి పెట్టుకొని తమ దర్శనం చేసుకొందామని లోపలికి వచ్చేనండి!
భామ:-ఎంతపని చేశావు! ఓరి వెర్రివాడా వట్టి పూర్వకాలపు మనిషిలాగున్నావే! సంచీ ఎవరేనా వీధిలో పెట్టుకొంటారా! వేగిరం వెళ్లిరా, ఎవరేనా ఎత్తుకు పోతారు, వేగిరం.
కుర్ర:-చిత్తం చిత్తం!

(వెళతాడు)

(సశేషము)

# రాష్ట్రభాషగా సంస్కృతము



రాష్ట్రభాషగా సంస్కృతము ఉండాలా హిందీ ఉండాలా అని ఆలోచన, యిదివరలో లేనేలేదు. రాష్ట్రభాష యింగ్లీషు ఉండకూడదని మాత్రము నిర్ణయించబడింది. తిరిగి హిందీయా లేక హిందూస్థానీయా అని తర్జన భర్జనలు జరుగుతున్నాయి కూడా.

రాష్ట్రభాష సంస్కృతము ఉంటే చాలా బాగుంటుందని కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు యిదివరలో సూచించారు.

హిందీ భాషోన్మాదులు, ముఖ్యంగా ఉత్తర ప్రదేశ్ వాస్తవ్యులు కొందరు, హిందీమాత్రమే రాష్ట్రభాషగా ఉండాలని హిందూస్థానీ పనికి రాదని వాదిస్తూ వచ్చారు. ప్రజల వాడుక భాషయైన హిందూస్థానీ పనికిరాదని_హిందీయే రాష్ట్రభాషగా ఉండాలని యు. పి. రాష్ట్ర భాషోన్మాదులు కోరుచున్నారు.

దేశంలో తమభాష అన్ని ప్రాంతాలవారికి నిర్బంధంగా విధించి, తాము దేశ పెత్తనం భాషారీత్యా వహించటానికి హిందీభాషావాదులు కోరుచున్నారు. ఉర్దూ పోదగిట్టదు కాని ఎక్కడో ఉన్న దక్షిణాది వారికి హిందీరాష్ట్రభాషగా ఉండవలసిన అవసరం ఏమిటో నాకు బోధపడుటలేదు.

పూర్వకాలంలో సంస్కృతం మనకు రాజభాషగా యుండేది. ఆ కాలంలో మనదేశంలో అనేక కళలు అభివృద్ధి చెందేయి. సంస్కృతములో నుంచే అన్ని భాషలు పుట్టినట్లు అది అన్నిభాషలకు తల్లి భాషయని చెప్పుతారు. సంస్కృతం యింతవరకు సనాతనుల భాష అని నిర్లక్ష్యం చేశాము. దానినే ప్రజల భాషగా చేస్తేబాగుంటుంది.

ఇక దేశజనాభాలో ఎక్కువ మంది కూలీలు, రైతులు, వీరు తమ పొలంలో కూలిపని చేసుకొని తమ మాతృభాషలో నిత్య వ్యవహారాలూ చేసుకొంటూ ఉంటారు. అట్టివారికి అదనంగా హిందీ భాష నేర్చుకోవటం వృధాశ్రమ తప్పితే ప్రయోజనం ఏమీ ఉండదు.

అసలు రాష్ట్రభాష అవసరం ఏమిటో నాకు అర్థం కావడంలేదు. స్విట్జర్లాండులో 16 భాషలున్నట్లు వినికిడి. అక్కడ రాజభాష అవసరం లేకపోయింది _ ఇండియాలో అవసరమైంది. ఏభాష కాభాష అభివృద్ధి పొందనీయకుండా అణగద్రొక్కటానికి హిందీభాష ఉపయోగ పడుతుందే కాని, మన రాజకీయ వ్యవహారాలు చక్కబెట్టలేదు.

సంస్కృతం రాష్ట్రభాష అయితే మన దక్షిణాది భాషలన్నిటికి మెరుగువస్తుంది, హిందీ అయితే మన దక్షిణభాషలు ముఖ్యముగా తెలుగు సంకరభాషగా పరిణమిస్తుంది.

ఈ ఉత్తరాది భాషాదాస్యం మనకు సంక్రమించకుండా త్వరలో జాగ్రత్తపడటం అవసరం: మన భాష, సంస్కృతిని రక్షించుకొనటానికి సంస్కృతాన్ని రాష్ట్రభాషగా అంగీకరింప జేయాలి. అది ఉత్తరాది వారికికూడా అంతపేచీ ఉండదు.

ఏకొద్దిమందో ప్రభుత్వ కార్యకలాపాలు నిర్వహిస్తారు. అట్టి వారికోసం అవసరంలేని వర్గాలు రాష్ట్రభాషపేరుతో హిందీనిర్బంధంగా నేర్చుకోవటం అవివేకం.

రాష్ట్రభాష అవసరం తప్పనిసరి అయితే సంస్కృతం రాష్ట్రభాషగా ఉండాలని వాంఛిస్తున్నాను. గృహలక్ష్మి సంపాదకుల సంపాదకీయాన్ని హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను.

కొవ్వలి సత్యవతీదేవి

—(౦)—

రాష్ట్ర భాషగా హిందీ వుండాలంటారు నాయకులంతా. కాని దానిలోని మంచీ చెడ్డా గ్రహించటం లేదు. హిందీ ఏవిధంగా గొప్పదని దానిని రాష్ట్ర

భాషగా స్వీకరించటం? లిపి అందంగావుండి, అక్షరాలు ఎక్కువగా వున్న భాష మన తెలుగు భాష. కాని దీనిని బట్టి తెలుగుభాషనే రాష్ట్రభాషగా చేయమని నాఉద్దేశము కాదు. తెలుగుభాషకు మూలం సంస్కృతం. తెలుగు భాషకేమిటి? యావద్భారత దేశంలోని ముఖ్య భాషలన్నిటికీ మూలం సంస్కృతమే! అటువంటి సంస్కృత భాషయే రాష్ట్రభాషగా ఎన్నదగును. కాని "సంస్కృతం రాష్ట్రభాషగా చేయటం పడదు! ఎందుకంటారా— అది నేర్చుకోవటం సులభంకాదూ, మరియు సంస్కృతం సామాన్యంగా మాట్లాడిన భాషాగాదు" అంటారు కొంతమంది నాయకులు. కానీ ప్రయత్నిస్తే మానవునికి కష్టమయిన పనేముంది? రాజభాషయగు సంస్కృతమును వదలి, హిందీని రాష్ట్రభాషగా చేయటం, మాతృభాష హిందీఏ అయినటువంటి ముఖ్యమంత్రులకు బాగానే వుంటుంది! కాని మనకు అది తీరని ద్రోహం, భారతదేశపు సంస్కృతి, విజ్ఞానము సర్వమూ సంస్కృతమునందే యున్నవి. కనుక సంస్కృతమునే రాష్ట్రభాషగా చేయటం, మరే భాషనన్నా రాష్ట్రభాషగా చేయటంకన్నా లక్షరెట్లు మేలు.

నిమ్మగడ్డ వెంకటసుబ్బారావు.

# బాలాంబ

శ్రీ వేదము వెంకటకృష్ణశర్మ గారు

(గత సంచిక తరువాయి)

నేర్పుమై రాజ్యపాలన నెఱపు తనదు
నాథునకు బాల 'తలలోని నాల్క'యట్లు
వర్తిలుట విని, యాతన్వి భాగ్యమునకు
మదిని సుప్పొంగెఁ జనవేము మహిపవరాళి ॥

పాలకోట ప్రజా ప్రభుభక్తి నతఁడు
తనసతికిఁ దెల్పఁ, బైకి సంతసముఁ గన్న
యట్లు, మోమున విసపునవ్వలర, నామె
వినియె, లోలోన దుఃఖాగ్ని యినుమడింప ॥

అగ్గిదొగ్గిన క్రోఁతియొ, యావదిన్న
వ్యక్తియో- యన నిలుకడవాసి, యకట!
'తా నొకటి మదిఁ దలఁచిన దైవ మొండు
దలఁచెఁ గద' యని రాణి చింతను వహించె॥

బాలపేరిమి 'గుండెలో గాలమట్లు
దవిలి, తెవు లింత తేని వేదనను గూర్ప
నెట్టులే, నామె సంసార మేటఁగలుపఁ
బంతమున సుందరీదేవి పట్టుపట్టె॥

ఉవిద లిరువు రొకానొక యుదయవేళఁ
బాలకోటను గల కొండపైని నిలిచి
ప్రాంతసీమలఁ బ్రకృతి సౌభాగ్య మరయు
చొండొరులు మాటలాడుచు నుండిరంత॥

అసమలావణ్యరేఖల, దెసలఁ గాంతిఁ
బఱపు నిరవది మేడల తెఱవ యొక్కతె;
ముద్దులొలికెడు నాయమ మోమొకింత,
చింతచేఁ, జిన్నవోయిన చెలువు దోఁచె॥

తదితరాంగన త్రిదశ వత్సర వయస్క,
యామె దాల్చిన యాభరణాంబరములు
దొలి యువతి కామె దాసిగఁ దెలుపుచుండె
నామె వినుచుండెఁ దన ప్రభ్వి యాడునుడులు॥

ఆ యిరువురఁ జిన్నది కథానాయిక యగు
బాల;- పెద్దది చెలియయి వఱలు సీత;-
మదినిగలఁగి, వివర్ణమా వదనమొసఁగఁ
జేటితో, దేవి యిట్లని చెప్పఁ దొడఁగె॥

భారముల నన్నిటను, రాజ్యభారము కడు
దుర్భరం, బదిపూనుట దుర్ఘటంబు;
ప్రతిదినము గట్టెల నొర్చి బ్రదుకువాఁడు
గ్రామముం జేరి సుంత విశ్రాంతిఁ గాంచు॥

ఇనుమెడారుల వెన్నొత్తె నెంతొ బరువుఁ
దాల్చి పయనించు లొట్టియ, దారుణంపు
బడలు గమ్యస్థలముఁ జేరి పాయఁగలుగుఁ
గాడి విడిచిన యెద్దును గనును శాంతి॥

రాజ్యభారమె నానాఁటఁ బ్రబలి ప్రబలి
దాని వహియించువారి కెంతేని మదికిఁ
గలఁతఁ గూర్చుచుఁ గ్లేశమ్ముఁ గలుగఁజేయు
తెలయందైన హాయి నిద్రింపనీదు॥

ఓసి, సీతా ! చెలీ ! యిప్పు డొక్క మేలు
నీవలనఁ గావలయు, గమనించి వినుము,
పాలకోట ప్రజాళికిఁ బ్రళయ మొందు
గలుగనున్నది, దానిఁ బోకార్పఁదగును॥

కొలువు కూటమునకు నిన్న కొండపీటి
రాజభటుఁడొక్కఁడరుదెంచి, ప్రభువుఁ గాంచి
యిచ్చె మా మేనమామ తాఁ బుచ్చెనంచు
జాబొకం, డది దొరవారు చదువ, వింటి॥

నిత్య, మేలినవారు మన్నించి మాకు
నెల్లవిషయముల్ పలుకుదు, రీవెఱుఁగవె ?
కాని, నిన్నటిలేఖలోఁ గలుగు నాజ్ఞ
ఇంచుకంతయుఁ దెల్పరై రేమొ సీత !

---



# కంఠశోష



శ్రీ ఇనుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

తల్లి:-సురభి అందంలో జతే అని సుగంధి కూడ సర్టిఫికెట్టు యిస్తుంటె యింకా అనుమానిస్తావేమిట్రా! పెళ్లి పేరంటం అంటారు. ఏ యీడప్పుడు ఆ వేడుక లుండాలిగాని తర్వాత అవి రమ్మంటే మాత్రం వస్తాయిట్రా! ఏం ... మాట్లాడవే! ...

కొడుకు:-ఆ ... సుగంధి చెప్పంగానే సరే మిటి ... ఆడవాళ్లకు ఆడవాళ్లు నచ్చరు మరి. అందంగా వుందో లేదో మగవాళ్లు చెప్పాలి.

తల్లి -అవుతే తమ్ముణ్ణి అడుగు; నాన్నగార్ని అడుగు. పిల్ల బంగారంవంటిది-పిల్లకే వంక పెటతారుగా.

సుగంధి:-అన్నయ్యా అదిగాదు. మగవాళ్ల కళ్లకు అందరు ఆడవాళ్లు బాగా నేవుంటారు. ఆడది అందంగా వుందోలేదో ఆడదే చెప్పాలి. దానిలో వుంది మజా.

తల్లి:-అవునేవ్ ఆమాటా నిజమే. . ఏదా అవుతే అమ్మాయి చెప్పినట్లు, నేను, సుగంధి అందంగా వుందని చెప్పుతున్నాముగా.

కొడుకు:-సరేలే ప్రతిపాదనలు, సవరణలు, నిర్ణయాలు అన్నీ మీవేనా, ఇకనన్ను అడగటం యెందుకు!

తల్లి:-పోనీ సవరణ యేమిటో చెప్పరాదూ.

కొడుకు: సురభికంటే బాగున్నవాళ్లు లేరా!

తల్లి:-ఆమాటెందుకు. నీకు సురభినచ్చలేదా?

కొడుకు:-ఆవిషయం తర్వాత, ముందర నా ప్రశ్నకు సమాధానం చెప్పు; సురభికంటె అందమైనవాళ్లు లేరా?

సుగంధి:-అట్లా అవుతే నువ్వెంత అందమైన వాళ్లనైనా తీసుకురా నేను వంక పెట్టేటట్లు.

కొడుకు:-ఓహో తెలిసింది. సురభికి వంక వున్నదన్న మాటేగా.

సుగంధి:-సరేలే అన్నయ్యా నువ్వెప్పుడూ యిలాంటి అర్థాలే తీస్తావు. సురభికివంక వుందని చెప్పానేమిటి?

తల్లి:-మనిషి అన్న తర్వాత వంకలుండక పోతాయా! నువ్వు తీసుకొస్తావా వంకలు లేనిదాన్ని. నిక్షేపంలాంటి పిల్ల వుంటే దానికేదో వంక పెడుతున్నాడు. ఏముంది వంక చెప్పు.

కొడుకు:-చెప్పటం మొదలు పెట్టితే యెన్నైనా చెప్పచ్చులే.

సుగంధి:-వూరికే మాటలనటం కాదు. చెప్పు చూద్దాం.

కొడుకు:-నాకు దాని వంకలన్ని చెప్పటమే పని వాళ్లమ్మాయి మంజు చూడు ఎట్లా వుంటుందో!

తల్లి:-పొరిగింట పుల్లకూర రుచని, అయిన వాళ్లను వదలుకొని, పరాయివాళ్ల మాట యెందుకంట.

సుగంధి:-అమ్మా వూరుకోవే నువ్వు. పోనీ అన్నయ్యా మాటే సరి అందాము, ఏం మంజు అందంగా వుందంటావా సురభి కంటె.

కొడుకు:-నీకు సందేహమా!

సుగంధి: గరుత్మంతుడు లాగ ముక్కు-అదీను. ఏం తెలుసు నీకు ఆడదాని అందం.

కొడుకు:-రాగా రాగా మంజును ఆక్షేపించాల్సిందే...

తల్లి:-అవన్నీ అనవసరం. ఇంతకీ ముఖ్యమైన మాట నీకు సురభి నచ్చిందా లేదా!

కొడుకు:-నాకు యీ చదువు పూర్తికావాలి. అప్పుడు..

తల్లి:-చదువుకూ పెళ్లికి సంబంధం యేమిటి. చదువుకుంటున్న వాళ్లంతా పెళ్లి చేసుకోకుండా వుంటున్నారా! అయినా అడిగినదానికి సమాధానం చెప్పు.

సుగంధి:-అన్నయ్య యెప్పుడూ యింతేనే.

తల్లి:-ఏరా; ఇంత కట్నం కానుక యిచ్చే వాళ్లే. ఈడూ జోడూ బాగుంటుంది. ఏమంటావు?

కొడుకు:-అన్నీ బాగానే వున్నాయి కాని ఆమూతి దగ్గరే కొంచెం...

సుగంధి:-అవున్లే మూతిదగ్గరేగా ... ...

తల్లి:-మరీ అల్లరి పిల్లవవుతున్నావే. అన్నయ్య వున్నాడని లేదు-ఏం లేదు...

కొడుకు:-అననీక పోయినావు ఏమనేదో వినేవాళ్లం ...

తల్లి:-చెల్లెలికి దగ్గ అన్న.. చెప్పు నాయనా చెప్పు... సురభికి సంగీతం కూడ చెప్పిస్తున్నారు.

సుగంధి:-ఆమాట నాదగ్గర చెప్పక, అన్నయ్యా, సంగీతము మీద మాత్రం ఆశ పెట్టుకోక గొంతిక...

కొడుకు:-ఒకదానిమీద ఆశ పెట్టుకుంటున్నానా, నువ్వు సంగీతం మీద ఆశ పెట్టుకోవద్దనటానికి.

తల్లి:-అవన్నీ యెందుకుగాని, ముఖ్యమైనవి ఆడదానికి పని పాటలు అన్నారు, పనులన్ని చేస్తుంది. ఇప్పుడు వాళ్లమ్మకు అండగా వుందనుకున్నావు.

కొడుకు:-అదా నీగొడవ, పెళ్లి అవుతే నీకు పనన్నా తప్పుతుందనా! ...

తల్లి:-ఆ!.. కోడలు వచ్చి వారుస్తుందని తొందర పడుతున్నా. విషయానికి చెప్పాగాని, అది వచ్చి నాకు చేసేదేమిటి, నాచేత చేయించుకోకుండా వుంటేచాలు. కాలు చెయ్యి తిన్నగా వున్నంత వరకు, నేను యెవ్వరిచేత చేయించుకోక్కర్లేదు. ఈఘటం యిట్లా వుండగానే దాటిపోతే చాలని వేయి దేవుళ్లకు మొక్కుకుంటున్నా.

సుగంధి:-మాట మాట్లాడితే సరి దాటి పోవటం దాటిపోవటం ...

తల్లి:-ఇంతకీ ఏమంటావురా!

కొడుకు:-ఇంకా పెద్దదైనకొద్దీ లావు అవుతుందేమో అనిపిస్తోందే.

తల్లి:-అదేం లావు అవదులే. గుమ్మటం లాగ వుండాలసిన రీతిగానే వుంది. నీకా భయం అక్కర్లేదు.

కొడుకు:-మరింకేభయం కావాలి ...

తల్లి:-వూరికే విసిగించక ప్రాణం. ఏభయం అక్కర్లేదు. నీకు పిల్లనచ్చితే చాలు.

కొడుకు:-నాకు నచ్చితే చాలా ...

తల్లి:-నీకు నచ్చక యింకెవరికి నచ్చాలి? చేసుకునేది నువ్వా మరెవరు?

కొడుకు:-ఆ...అది కాదు మీ అందరికికూడా నచ్చాలిగదా అని.

సుగంధి:-మా మాట అదివరకే చెప్పాంగా ఇంకొకసారి పెళ్లాం సంగతి మాచేత చెప్పిద్దామని ...

కొడుకు:-అప్పుడే పెళ్లాన్ని చేశావూ.

సుగంధి:-అమ్మా, అసలు యింతకీ వదినను అడిగారా, యిందాకటినుంచి, అన్నయ్యను అడగటంలోనే సరిపోతోంది.

తల్లి:-ఎక్కడైనా మగవాళ్లను అడుగుతారు కాని, ఆడపిల్లను అడగటమేమిటే.

సుగంధి:-అది మీకాలం. ఇది మాకాలం. పురుషునికి యెంతహక్కో స్త్రీకి అంత హక్కే.

కొడుకు:-అవును భార్యా భర్తలు సమాన భాగస్వాములుగా నిజమే.

తల్లి:-ఈ మాటలకేం కాని, చెప్పరా నాయనా చెప్పు. ఖాయం చెయ్యమంటావా. అయిన వాళ్లతో పని, బంధుత్వము వృద్ధి అవుతుంది ...

కొడుకు:-సరే యిన్ని చెపుతున్నారుగా, ఇంకా నేనెట్లా కాదనటం.

సుగంధి:-అమ్మా, నేను చెప్పలా, అన్నయ్యకు చేసుకోవాలనే వుందే. కాని మనచేత చెప్పిద్దామని ఆడిననాటకం. సురభి అందంగా వుంటుందని అన్నయ్యకు మాత్రం తెలీదూ. అమ్మా అన్నయ్య తేల్చి చెప్పాడుగా ఇక వదినను కూడా అడుగుదామే.

తల్లి:-దానిని అడిగేదేమిటే!

సుగంధి:-అయినా అడుగుదామే ఏం చెపుతుందో! ఇంట్లో లేనట్టుంది. స్కూలుకు వెళ్లిందేమో ... నూరేళ్లు ఆయుర్దాయము అదుగో వస్తోంది. సురభీ బావ నిన్ను చేసుకోవటానికి వప్పుకున్నాడు ఇక నీవుద్దేశమేమిటో చెప్పు.

సురభి:-ఎన్నిసార్లు, మా అమ్మ వాళ్లకు అదివరకే చెప్పా. రాగిజుట్టు, చట్టిముక్కు బావను చేసుకోనని.

తల్లి:-ఆ...ఆ... అందాకా వచ్చిందీ నీపని.

సురభి:-ఏం, ఎందాక వచ్చిందేమిటి, మగవాళ్లకేనేమిటి నచ్చాల్సింది. నాకు నచ్చితేనే చేసుకుంటా.

తల్లి:-వింటున్నావుట్రా.

సుగంధి:-అందుకనే గామాలు అన్నయ్యా నాకు నచ్చితే చాలా అన్నది.

(ఆలిండియా రేడియో హైదరాబాద్ సౌజన్యంతో)






## కొబ్బరి హాల్వా

ఐదు కొబ్బరకాయలకోరు రోటిలోరుబ్బి, శాల్పడి అనగా పావుపడి నీళ్లలో కలిపియుంచుకొనవలెను. అరపడి చక్కెరను కాల్‌పడి నీళ్లతో పాకము పట్టుచూ, అంగుళము పొడుగు తీగెవచ్చినప్పుడు కొబ్బరిపాలనుపోసి కలియబెట్టవలెను. బాదముపప్పు, ద్రాక్షపండ్లు, ఏలకులపొడివేసి గట్టిపడిన పిదప మూడుపలముల నెయ్యిపోసి కలియబెట్టి తట్టలో చదురపరచి, తర్వాత బిళ్లలుగా కోయవలెను. మహా రుచికరముగా నుండును.

వాసిరెడ్డి సుశీలాదేవి

## మైసూరు వడ

ఒక ½ శేరు పెసరపప్పు నానవేసి మెత్తగా రుబ్బవలెను. రుబ్బిన పిండిలో ½ సోలెడు నానవేసిన శెనగపప్పు కలపవలెను. దానిలో సవాపావు పచ్చిమిరపకాయలు తరిగి, 2 తులముల ఉప్పు, 1 తులం జీలకఱ్ఱ, కొద్దిగా కొత్తిమీర వేసి బాగుగా కలుపవలెను. ¼ శేరు నూనెనుగాని, నేతినిగాని బాణలిలోవేసి కాగనిచ్చిన తరువాత గారెలు వండిన మాదిరిగా వండినచో, ఎఱ్ఱగా వేగినపుడు వాటిని తినిన బహు రుచికరముగ నుండును.

## గ్రీన్ వడ

ఒక ½ శేరు మినపప్పు నానవేసి పొట్టుతీసి మెత్తగా రుబ్బవలెను. సవాశేరు పెరుగు తోటకూర సన్నగా ముక్కలు తఱుగవలెను. 1/8 వీ॥ పచ్చి మిరపకాయలు, 2 తులముల అల్లము తరిగి, 1 తులము జీలకఱ్ఱ, చిటికెడు సోడా మినప పిండిలో కలుపవలెను. బాణలిలో ½ వీశెడు నూనెగాని, నెయ్యిగాని పోసి కాగిన తర్వాత నిమ్మకాయ పరిమాణమున ఉండలుచేసి అరటి ఆకుమీద పెట్టి అదిమి దానిలో వేయవలెను. అవి వేగిన తర్వాత తినుటకు బాగుగ నుండును.

బొడ్డుపాటి శారదాంబ

## పులిహోర గోంగూర చేయువిధము

ఒక వెడల్పయిన గిన్నెలోగాని, యినుప బాణలిలోగాని నాల్గుతులముల నూనెపోసి కాగపెట్టి, కాబటిన మిరపకాయలు నల్లబడేలాగున వేయించవలెను. ఆఖరికి తగుమాత్రము మెంతులు ఆవాలు యింగువావేసి చిట చిట లాడగానే దించుకోవాలి. తరువాత మెత్తగా ఖారముకొట్టి, ఖారానికి సరిపడిన వుప్పు గోంగూర తెచ్చి నీళ్లుపొయ్యకుండా దంచవలెను. చింతపండు నానబెట్టి, పిప్పితీసిన రసము సిద్ధముగా యుంచుకోవాలి. తదుపరి మిగతానూనె బాణలిలోపోసి తిరుగమోత వేయించవలెను. మిరపకాయలు, మినపప్పు, సెనగపప్పు, ఆవాలు, కరివేపాకు, యింగువ, వేగిన తరువాత చింతపులుసు తగిన వుప్పువేసి కుత కుతా వుడకనిచ్చి ఆరిన తరువాత పచ్చడిలోపోసి బాగా నూరవలెను. ఆపచ్చడిని చల్లగా వుండజూచి జాడీలో పెట్టవలెను. ఇలా తయారుచేసిన పచ్చడి మూడు మాసములవరకూ నిలచియుండును.

పి. శేషమాంబ

—(o)—

# ఊరడింపు

పవలుగతించె నల్లదిగో భానుఁడు గ్రుంకెను పశ్చిమాంబుధిన్
కవగొనియేగుచున్నయవి క్రమ్మరి గూళ్ళకు పక్షిసంతతుల్
దివిమొగమైన యాకమల దీనతవాల్చె శిరంబు దిక్కులన్
గవిసె తమంబు నీహృదయ కాంతుఁడు వచ్చెడిఁ నూరడిల్లుమా

ఇంతయడఁబాటుకే వగపింతయేల। పవలుగడచిన రేయిను వచ్చుమరల
రేపవళ్ళును చక్రంబురీతి దిరుగు। స్థిరముగాబోదు కాలమస్థిరము సుమ్మ

కాలము వకరికి సొమ్మా! చేలా!। వగవంగరాదు పిరికితనమగున్
వాలాయంబుగ నీకొక। కాలమురాగలదు వెలుగగలవు జగానన్

నీవుమహాపతివ్రతవు నిర్మలచిత్తవు గాంచ నెప్పుడున్
నీవిభుదక్క నన్యుల ననింద్యచరిత్రవుగా కుముద్వతీ
నీవిధమాతఁడెల్లరుగు నిర్మల చిత్తము చంచలాత్ములా
భూవిభులెల్లరుంగుదురు భూరిరుధాంధులు వారుమాననీ

విప్పవు మాసినకన్నుల। తప్పవు నీవ్రతము సుంత తరుణుల కెల్లన్
యొప్పగుఁ నాదర్శము నీ। చొప్పుమహా గొప్పదౌను జూడ కుముదినీ

ప్రేమే దైవము దైవమె। ప్రేమ నిదానంబటంద్రు పెద్దలు భువిలో
ప్రేమకు నీవాదర్శవు। కామినులకు దివ్యబోధకము నీ చరితల్

పగటికెల్లను వెలుగొక్క భాస్కరుండె రాత్రికెల్లను వెల్గు రారాజొకండె
తరుణి ప్రేమకు పాత్రుండు ధవుడొకండె యనుచు యెల్గెత్తి బల్కుతి వలఘుచరిత

చల్లనివాఁడు నీవిభుడు సర్వజనాదరణీయుఁడెంతె నీ
యుల్లము పల్లవించునిక యుగ్మలి యున్మలికంబు మానుమా
యల్లదె తూర్పుకొండపయి నాతని దివ్యపతాక కాంతులున్
దెల్లముగాగ దోఁచెడిని తీవ్రతరాగమనంబు జూపెడిన్

అడలకుమమ్మ, యూరడిల్లుమమ్మ కుముద్వతి నీవిభుండదె
వడి వడి నేగుదెంచె గనువాంఛలు దీర్చను గ్రాగియుండు నీ
బెడిదపు వేదనా భరము ప్రీతిని శీతకరుండు మాన్పవ
చెడినదె పూర్వదిక్ సిఖరి చెన్నలరారె మనోజ్ఞకాంతులన్.

—(o)—

గంటి కృష్ణవేణమ్మ

# చర్మబాధలకన్నిటికీ




# సైబాల్

చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనిదై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.






## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్
# బేబిగ్రైప్



తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెంసీస్ - విజయవాడ, శికింద్రాబాద్,
బరంపురము (గంజాం), బొంబాయి.

# విద్యావిధానములోని ఐక్యత

శ్రీమతి సత్యవాడ లక్ష్మీదేవి

నేటి విద్యావిధానమును నెలకొల్పిన వారు పాశ్చాత్యులు. చాలాకాలమువరకు మనకు పాలకులుగానుండిన పాశ్చాత్యుల విధానముననే మనము నేడును అనుసరించుచున్నాము. పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయములు మొదలైన విభాగములన్నియు వారేర్పరచినవే. ఆప్రణాళికయే యిప్పటికిని నడుచుచున్నది. పయిరీతి నున్న విద్యాశాలలోని ప్రణాళిక, భోధన క్రమము, విషయ విభజనము మొదలయిన, వన్నియును, ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి మొదలగు విశ్వ విద్యాలయములలో నుండిన ప్రాచీన విద్యా విధానమునకు ప్రతికలనుట తెలిసిన వారికి స్పష్టమే.

నేడు భారత స్వాతంత్రమును పొందిి, తనకు స్వభావికమైన నాగరికతను, జాతీయతను అభివృద్ధి పఱచుకొని ప్రపంచ విజ్ఞాన సముదాయమునకు తన వంతును చేర్చి, తన వ్యక్తిత్వమును నిలుపుకొని పెద్దతనమును వెలయించుకొనవలసిన యవకాశము లభించినది. ప్రాచీనకాలములో అనగా పాశ్చాత్య నాగరికతా ప్రవాహము మనలను ముంచివేయకముందు, మనకు స్వాభావికమైన ఔన్నత్యము, నాగరికత వ్యక్తిత్వం ఉండినది. బుద్ధుడు, అశోకుడు, శంకరుడు మొదలైన మహానుభావులు ప్రపంచ విజ్ఞాన సంపాదనలో గొప్పగా యుపకరించి భారత దేశము యొక్క గొప్పతనమును శాశ్వతముగా స్థాపించి యున్నారు. దీనికి కారణము వారి అనుభవము స్వేచ్ఛతోనుండిన వాతావరణములో స్వయం దీప్తముగా కలిగి యుండుటయే యనక తప్పదు.

పయిరీతినే నేటి భారత దేశములో వ్యక్తులును, సంఘములును, తమ స్వభావికమైన వికాసమును పొందవలసి యున్నది. ఈవికాసమునకు హేతువైనది విద్య. అట్టి విద్యవలననే భారత దేశముయొక్క చైతన్యమును పునరుజ్జీవింప చేయవలసినది. ఈ విద్యాప్రణాళికను నడుపువారు అనేకులుగా నున్నారు. భారత దేశ మంతటిలోను, చిన్న రాష్ట్రములు, ఆ రాష్ట్రములలో చిన్న సంఘములు, వేరు వేరు అంతరువులలో కూడిన అధికార వర్గములు గలవు. ఎవ్వరి పద్ధతికి వారే కర్తలుగా నున్నారు. ఈప్రణాళికల కన్నిటికిని సమన్వయము, సామరస్యము, కనుపట్టదు. లెక్కకు మీరిన విశ్వ విద్యాలయము లెన్నో చిహ్నములై యున్నవి. వీటి కన్నిటికిని సమన్వయము చేయగలిగిన "విశ్వవిద్యాలయ సమాఖ్య" యొకటి కలదు. కాని, యివి నామమాత్రమే. దీనికి అధికారములేదు. అందరు సలహాలు మాత్రము ఇచ్చుచుందురు.

ఇక ఉన్నత పాఠశాలలో పాఠ్యప్రణాళికలు - చిన్న రాష్ట్రములలో చిహ్నములుగా

నున్నవి. వీటికన్నిటికిని కొంత సాపత్యము గలదు కానీ, సన్నిహితమైన సామరస్యము ఏర్పడవలసినదిగానున్నది. ఒక ప్రజాసంఘమునకు ఐక్యభావము కల్పించి, జాతీయతను స్థాపింప వలసినప్పుడు, విద్యా విధానము అంతయును ఒక్కటే ఉద్దేశముతో ఒక్క కేంద్రస్థాపనమునుండి నడిపించి తీరవలసినదే. జర్మను దేశమున నైక్యము కల్పించి దాని ఔన్నత్యము నేర్పఱుచుటకు, విద్యా విధానముననే, ముఖ్యమైన సాధనముగా హిట్లరు ఉపయోగించెను. నేటి జర్మను దేశపతనమున కాతడు కారకు డెట్లయ్యెనో, నాటి ఐక్య భావమునకును శక్తికిని గూడ కారకు డాతడే యయ్యెననుట నిర్వివాదాంశము.

ప్రస్తుతము మన భారతీయ నాగరికతలో రెండు విభాగములున్నవి. ఆంధ్ర, తమిళ, కర్ణాట, మళయాళ, వంగ, మహారాష్ట్ర ఘూర్జరాదికమైన రాష్ట్రీయ స్వరూప మొక్కటి. అఖిల భారతదేశ సామాన్యమయినది రెండవది. తుంగభద్ర మొదలయిన యుపనదులన్నియును కృష్ణా స్రవంతిలో గలిగినట్లు, పయి రాష్ట్రీయ స్వరూపమంతయు భారతజాతీయ ప్రవాహమున నిమిడియుండవలెను. కాబట్టి ప్రతి వ్యక్తియు తానాంధ్రుడు, తమిళుడు, కర్ణాటకుడునయ్యును, భారతజాతిలో నిమిడి యుండవలెను. రాష్ట్రీయ స్వరూపమున నున్న నానాత్వమునకు ఐక్యత నేర్పరుచునట్టి ప్రణాళిక విద్యా విధానమునందుండవలెను.

అప్పుడే రాష్ట్రములు పెంపొంది భారత జాతి వికాసమొందగలదు. ప్రతిరాష్ట్రము నందును స్వాభావిక సిద్ధమైన దేశభాష అభ్యాసములు, వేషము, ఆహారపద్ధతి, విశ్వాసము, వాఙ్మయము మొదలయినవి వాని స్వరూపము ఆయారాష్ట్రములవారికి తెలుపక తప్పదు. కాబట్టి ప్రాథమిక విద్యా విధానమున ఆంధ్రభాష మొదలయినవి ముఖ్యములుగా యుండవలయును. అంతకంటే ఉన్నతవిద్యా విధానము భారతీయ స్వరూపమును భోధించుటకు వలసిన పద్ధతులేర్పడ వలయును.

మన భారతదేశములో ఎన్నియో రైల్వేలున్నవి. ముఖ్యపట్టణములకు పోవుమార్గములు మొదలగునవి మనలో పెద్దవారికీ తెలియవు. బాలుడు ఉన్నత విద్యాభ్యాసమును గడచి కళాశాల విద్య నేర్వవలసి వచ్చుసరికి అతనికి భారతదేశ స్వరూప స్వభావములు, వారియందలి ఐక్యభావమును స్పష్టముగా తెలియు విద్యార్థులందరును ప్రవేశ పరీక్షలకు పోవుటకు ముందు, కలకత్తా, డిల్లీ మొదలగు ముఖ్య పట్టణములను చూడ వలయును. ఈపనికిగాను ఒక ప్రణాళికయు కొన్ని సదుపాయములును, కొంత కాలమును వ్యయపరచి ప్రభుత్వము ఆరితేరిన ఉపాధ్యాయులను నియమించి విద్యోపార్జన యాత్రలను కొనసాగింప వలయును. ఆ తరువాత విద్యా విధానమున అంతర్జాతీయ ఐక్యమునకును, ప్రాపంచిక విజ్ఞాన

మునకును, ప్రాధాన్యము ఉండవలయును.

కళాశాలావసతిలో అంతర్జాతీయ భాష లైన, ఇంగ్లీషు, జర్మను, మొదలైనవి యును, విదేశీయ శాస్త్రములను చదువు అవకాశములు ఏర్పచవలెను. తన వ్యక్తిత్వమును గుర్తించుకొని, తానెట్లితరులతో సమానుడో నిరూపించు పద్ధతి బాలిక, బాలుర యందేర్పడవలెను. భేధమునుండి ఐక్యమును, నానాత్వమునుండి, ఏకత్వమును సంపాదించుటయే పరమావిధి.

పయివిధానములతో పాటు నేటి శాస్త్రములు, లలితకళలు, వైజ్ఞానిక విషయములు బాలురకు, బాలికలకు చెప్పుచుండవలెను. పాశ్చాత్యులు స్థాపించిన నేటి విద్యా విధానము మన జాతీయతకు సరిపడునట్లు కొంత వఱకు మార్చుకొని సర్దుకొనవలయును.

ఇక స్త్రీల విద్యా విషయములలో గూడ మన భారత దేశము పాశ్చాత్య ఐక్యతను పొందిన దనుటకు సందియము లేదు. చాలామంది స్త్రీలు పాశ్చాత్య స్త్రీల వలె విద్య నభ్యసించి జీవితమును స్వేచ్ఛగా నడుపుచున్నారు. మరియు స్త్రీలు పాశ్చాత్య దేశములకు పోయి విద్య నభ్యసించుచున్నారు. అదేవిధముగా, పాశ్చాత్య దేశపు స్త్రీలు గూడ, మన భారత దేశమునకు వచ్చి దర్శించి క్రొత్త విషయములను తెలుసుకొనుచున్నారు.

వివాహ విషయమందు మాత్రము మన భారత దేశమునకు పాశ్చాత్య దేశమునకు ఎట్టి ఐక్యతయు లేదని చెప్పుటకు సందియము లేదు. భారత దేశములో వరకట్నములను దురాచారములు యెక్కువగా నున్నవి. దీనివల్ల బీద కుటుంబమునుండు తల్లి దండ్రులెంతయు తమ బాలికలకు వర కట్నములు చెల్లించలేక బాధపడుచున్నారు. విద్యాగ్రంధములేని పశువులతోసహా, విద్య నేర్చిన వాడును కట్నముకోరి అబలల యొక్క తల్లిదండ్రులను పీడించి పిప్పిచేయుట చాలా శోచనీయకరమయిన విషయము! దీనికంతకును కారణము పాశ్చాత్యులకును, మనకును ఈవిషయములో ఐక్యత లేకుండుటయే. ఇప్పటికైనను జాతిమత భేదములు పాటింపక, పాశ్చాత్యులను మనము, మనము పాశ్చాత్యులను వివాహము లొనరించుట చాలా ముఖ్యమైన విషయము.

## ముఖ్యగమనింపు

గృహలక్ష్మి చందాదారులు, ఆఫీసుకు, ఉత్తరములు వ్రాయునప్పుడు, మనియార్డర్లు పంపునపుడు, వారి వారి చందా నెంబరు, నివ్వకోరుచున్నాము. అట్లుచేసిన ఉత్తర ప్రత్యుత్తరములు మొదలగు విషయములకు అనుకూలముగా నుండును.

మేనేజరు.

# "అదృష్టఫలం"



శ్రీ మున్నంగి రాజగోపాలాచార్యులు

ఆ పాడుపడ్డ యింట్లో ఇప్పుడెవ్వరూ లేరు. ఆ ఇంట్లో గూబలుతప్ప మరేవీ కాపురం చేసేట్లు అగుపించదు. అందులోను ఊరికి వెలుపల వుండటం మూలాన ఆ ప్రక్కకు ఒక్కరుకూడా తలెత్తి చూచే వాళ్లుకాదు. గాకనూ, ఆ ఇంట్లో భూతాలు, దయ్యాలు కాపురమున్నాయని, ఆ ఊరుమజీ తెలియని ఎవరో నూతనులు ఆ యింట్లో ప్రవేశించి ఆ దయ్యాల్కి, భూతాల్కి ఆహుతులై పొయ్యారని, ఒక పిచ్చి వదంతి వ్యాపించింది.

ఈ వదంతి ప్రాకిన లగాయితీ మరీ ఎవ్వరూ కూడా ఆ ప్రక్కకే పోవటాన్కి వెఱచేవారు. నిజాన్కి ఆ యింట్లో ఇద్దరు ముగ్గురు చచ్చింది నిజమేయైనా వాళ్లు దయ్యాల్తో పీడింపబడి చచ్చారో మరే కారణాలతో చచ్చారో తెలీకున్నా ఆ ఊళ్లో మాత్రం దయ్యాల్తో చచ్చారనేమాట స్థిరంగా నిలచింది.

స్థిరంగా అంటిపెట్టుకొని ఆ యింటి చరిత్ర తెలిసిన కొందరు పెద్దలు ఈ ఇల్లుకూడా ఒకానొకప్పుడు సంసారంతో కళ కళ లాడిందని చెప్తే దాన్ని నమ్మేవాళ్లేలేరు. అట్లని పూర్తిగా విననివాళ్లున్నా ఊసుపోవటానికి "ఆదేకథో కాస్త చెప్పుదురూ" అని అడిగినోళ్లకి ఆ పెద్దలు ఆ యింటి విషయం ఈలా చెప్పేవారు.

మంచివాడనిపించుకొని నవీన విద్యా సంస్కరణల కానవాలపై సత్సాంప్రదాయ కుటుంబంలో మెలగుతూన్న రాంజీ ఆ యింట్లో కాపురంచేసిన వాళ్లలో మొదటివాడు. ఆ యిల్లే అతని పిత్రార్జితపు ఆస్థి.

అతని తండ్రి తనకు తెలివి వచ్చీరాని దశలోనే ఈ లోకాన్ని విడిచేడు. తల్లి తన పురిటిలోనే కళ్లుమూసింది. ఎటొచ్చి రాంజీని అతని అమ్మమ్మే పెంచి పెద్దవాణ్ణిచేసింది. ఎక్కణ్ణో రాంజీ మేనమామవున్నాట్ట; అతడు మాత్రం అప్పుడప్పుడూ వచ్చి కష్టసుఖాలు విచారించుకొంటూ సంసారాన్ని ఒడుదుడుకులు లేకుండా అమర్చేసి పోతుండేవాడట. మేనమామ సింగుజీ అంటే రాంజీకి తగని భయం. రాంజీని అమ్మమ్మ కళ్లల్లో పెట్టుకొని అతను కోరిందల్లా అమరుస్తూండేది. ఆమెవల్లే హూణ విద్య నభ్యసించాడంటే ఆమె ప్రేమ ఎంత పవిత్రమైందో గోచరిస్తుంది.

రాంజీకి పెళ్లి వయసు రావటం, మేనమామ పిల్లని మాట్లాడటం, అతని కామెను ముడిపెట్టడం ఇట్టే జరిగిపోయింది. ఆ అమ్మాయి పేరు గంగు. అతనికి (రాంజీకి) ఆ అమ్మాయంటే గిట్టదు. ఆమె పతిభక్తే పరమలోకంగా భావించేదేగాక సనాతన ధర్మమే తన విద్యుక్త ధర్మంగా భావించే ఆ పవిత్రురాల్ని రాంజీ భరింపలేకపోయాడు. మామగారిపై గల భయభక్తులే అతడు ఆమెను పెండ్లాడ చేసాయేగాక చిత్తశుద్ధిగ తాను అంగీకరించి కాదు. అమ్మమ్మకి చేదోడు వాదోడుగా వుంటూ భర్తకు కంటిలోని పాపలా మెలగుతూ తన పనిలో తాను లీనమై పొయ్యేది గంగు. ఆ పేరు వినటానికైన అసహ్యించుకొనేవాడు రాంజీ. చెప్పుకోదగ్గ అందం ఆమెలో లేకున్నా కురూపికాదు. మామగారి భయంచేతనైతేనేం "పాలిటికి పడింది పరమాన్నం" అన్న సామెత ననుసరించి యైతేనేం రాంజీ గంగును భార్య రూపేణా దాంపత్య సౌఖ్య మనుభవించేవాడు.

ఎవరో రాంజీ క్లాస్ మేటట, సుగుణ అనునామె అప్పుడప్పుడు అతన్ని చూచేదానికి వచ్చేది. ఆమె రావటమే తడవుగ ఆమెవున్న మూన్నాళ్లు విలాసంగా మాట్లాడుకోటం షైరు కొట్టడం జరిగేది. రాంజీని ఆమె ఎవర్రా అని అమ్మమ్మ అడిగితే "ఆ … ఆ … ఎవ్వరో కాదు నాజతలో చదివిన అమ్మాయి - సుగుణ అంటారు అమ్మమ్మా" అనేవాడు. మూన్నాళ్ళకే రాంజీ సుగుణ వీడి పొయ్యేవాళ్లు.

గంగు జీవితాన్ని సుగుణ రెండు మూడు తూరు అడ్డు తగిలినా ఇదెంత కాలంతే, అనే ధీమాతో వారికి ఆటంకమంటూ పెట్టేదికాదు గంగమ్మ. భర్తను తనలో ఇముడ్చుకోవాలని, భర్తలో తాను ఇమిడిపోవాలని పడే ఆరాటంతో అప్పటి కప్పుడే తాపత్రయపడి, నవీననాగరికతను వాంఛించే భర్తకు అనాదరితురాలై అంతటితోనే తృప్తిపడి పొయ్యేది. ఆమె పూజాఫలితమో అన్నట్లు ఆమెకో చక్కని అబ్బాయి కల్గేడు. ముమ్మూర్తులా తండ్రి చాలే. అబ్బాయిని చూచియైనా తన కోర్కెలు నెరవేరక పోతాయాని స్వర్గానికి నిచ్చెనలు వేసేది గంగమ్మ. రాంజీ అంటే ఎంతో గంగుకూడా అమ్మమ్మకి అంతే.

కానీ రాంజీలో ఏవో తీరని కోర్కెలు అట్లే నిలిచిపోవటంచేత కాబోలు ఎప్పుడూ చింతా హృదయంతోనే తపిస్తూంటాడు. ఇక్కడ రాంజీకి పిల్లాడు పుట్టడమేమిటి అక్కడ సింగుజీ చావడమేమిటి? ఇట్టె జరిగిపోయింది. ఇప్పుడు రాంజీలో మేనమామ పోయినలగాయితీ హృదయం తేలికైనట్లయింది. తనలోవున్న ఆ కాస్తా భయం ఊడిపోయింది. తన పని ఇక నెరవేరుననేట్లు ఏదో యోచించి తల ఊపుకొనేవాడు.

నాడు గంగు పిల్లవాన్ని పాలిచ్చి తొట్టిలో పండేసి పిల్లాడు లేస్తే ఊపమంటూ అమ్మమ్మకిచెప్పి తాను పశువులకి గడ్డి తెచ్చేందుకు పోయింది. ప్రొద్దున్ననగాపోయి మధ్యాహ్నానికల్లావచ్చి పశువులముందు గడ్డిపడేసి వంటా, వార్పుచేసి పతికోసం ఎదురు చూచింది. కానీ అతను ఇంట్లోలేడు. పని వుంటేనే తప్ప ఎక్కడికి కదిలేరకంకాదని తన భర్త విషయం తెలిసిన గంగు అమ్మమ్మని అడిగింది. "ఇంతకు ముందు వస్తూండిని అమ్మాయి రాగా అలా వెళ్లాడమ్మా" అంది అమ్మమ్మ. ఏనాడూ లేని ఆవేదన ఆనాడెందుకో గంగమ్మలో కల్గింది. వెయ్యిదేవుళ్ళకి మొక్కుకొంది. ప్రొద్దు తిరిగినా భర్తవచ్చే జాడలు అగుపించటంలేదు. భర్తరాక కోఅకు తానూ అన్నంతినక ఎదురు చూస్తూంది. కానీ ఆశ ... ని ... రా ... శ అయ్యింది.

ఊరంతా తిరిగింది. భర్తజాడ అగుపించలేదు. ఊళ్లో అక్కడక్కడ అనుకొనే మాటలనుబట్టి తన భర్త సుగుణతో లేచిపోయాడన్న వార్త వింది. గుండె గుభేల్లున బ్రద్దలుకాగా బరువెక్కిన హృదయంతో ఇంటి ముఖం పట్టింది. భర్తకోఅకై అహర్నిశాదులూ ఏడ్చింది. అమ్మమ్మ మట్టుకు ఎంతో ఓదార్చింది. పిల్లాన్ని చూడాలమ్మ అంది. తుట్టతుదకు వాడు చచ్చాడనికూడ అనుకోమ్మా అంది ఆవేశం, దుఃఖం పట్టలేక అమ్మమ్మ. ఆ మాటలు వినేసరికి గంగమ్మ చెవులు మూసుకొని "హరి ... హరి ... ఎంతమాట! అలా అనకు అమ్మమ్మా! ఆయన నానుంచి పొందలేనిదేదో గొప్ప సుఖాన్ని సుగుణ ద్వారా పొందబడడంవలనే వారాలాపోగలేరు. వారు ఎక్కడనో ఒక్కచోట సుఖంగావుంటే నాకంతేచాలు. ఆ సుగుణ ఎంత ధన్యురాలో" అంది గంగు. కేవలం తన కోసమే కాకపోయినా పిల్లాడి కోసరమై బ్రతకలేక బ్రతుకుతూంది గంగమ్మ. పిల్లవాని చిఱునవ్వు పంచలలో భర్త పోకడను క్రమేపి మరువజొచ్చింది.

కాలచక్రం క్రమేపి సాగిపోతూంది. పిల్లాడి కోసరమైనా రాకపోతారా అని అనుకొన్న అంత్య ఆశలుకూడా అడియాసలయ్యినవి. గంగమ్మ హృదయంలో ఆ మిగిలిన చిన్నకోర్కెకూడా ఇక ఫలించదనుకొంది. ఈ కాలరథ చక్రంలో గంగమ్మ లాంటి అభాగినుల జీవితాలెన్ని ఈలా నలిగి మసియై పోతూన్నాయో??? ఊరు విడువాలనుకొంది గంగమ్మ. కాదు ఉన్నవూరులోనే చావాలంది అమ్మమ్మ.

ఎండిన కొమ్మనుంచి రాలిపోయే ఆకులాగా అమ్మమ్మకూడా గంగమ్మనుండి రాలిపోయింది. గంగమ్మ జీవితంలో తిరిగి దుఃఖాశ్రువులు ఆరంభమయ్యాయి. కానీ భర్తను ఏలాగు; పిల్లాడి చిఱునవ్వు పంచల్లో మఱచిందో అల్లాగే అమ్మమ్మ దుఃఖాన్నికూడా దిగమ్రింగుకొంది. బ్రతుకుపై



(మిగతా 490-వ పేజీలో)

# వెలి అంటే?

శ్రీ సి. హెచ్. రామమూర్తి

అది ఒక నాటి సంధ్యాసమయము. ఆ రోజే పౌర్ణమి. ప్రశాంతముగా నున్న ప్రకృతిని, పూర్ణచంద్రుని పరికిస్తూంది ప్రభావతి డాబామీద. ఇంతలో "అమ్మా" అంటూ తన దగ్గఱకు చేరింది కుమార్తె శశి.

"యేమమ్మా! యింత ఆలస్యమైంది"

"యేం లేదమ్మా, మా స్నేహితురాలు సావిత్రిగారి యింటికి వెళ్లేను."

ఎప్పుడూ కళకళ లాడుతూన్న మోము ఆ వేళ చిన్న బోవటం గమనించక పోలేదు తల్లి. ప్రభావతి మోహనులకు ఒక్కతే కుమార్తె శశి. క్రొత్తగా కాలేజీలో చేరింది. ఇంతకు ముందు పొరుగిండ్లకు పోవటంగూడ యెరుగదు; అయినా కాలేజీలోచేరిన ప్రతి వారికి స్వతంత్రం అనేది కొంత అలవడటము సహజము.

"అమ్మా; వాళ్లయింటిలో సావిత్రి అమ్మమ్మ...యింకా...మరెవరో కొందరు నన్నుజూచి మనల్ని గురించి యేమేమో మాటలాడు కుంటున్నారు. ఆ ముసలి మనల్ని వెలి వేశారని వాళ్లతో చెప్పింది. వెలివేయటం, అంటే యేమిటమ్మా?"

ఈ మాటలు ప్రభావతిని కలతపెట్ట సాగాయ్. ఒక్క మారు శశి చిన్నతనము నుండి వేసిన ప్రశ్నలు జ్ఞప్తికి వచ్చాయ్.

"అమ్మా లీల యీ పండగకు వాళ్ల తాతగారింటికి వాళ్లమ్మతో కలిసి వెళ్తుందట; మనము వెళ్లమూ?

సుశీలగారి యింటికి బంధువులు వచ్చారని చెప్పింది. మన యింటికి యెప్పుడూ రారేమమ్మా?"

ఆ ప్రశ్నలకు యెప్పుడూ జవాబు సరిగా చెప్పలేక తీయని కబుర్లతో సంతోష పెడుతూ వుండేది. కాని యీ ప్రశ్నకు మాత్రము జవాబు చెప్పనిశ్చయించింది.

"శశీ, మనల్ని వెలివేశామంటున్నారా! అలా కాదు; మనము వారిని, ఆ మూఢ సంఘాన్ని వెలివేశాము. నేను చెప్పబోయె కథవిను – నీ ప్రశ్నకు యీ కథ జవాబు చెబుతుంది. ఇది నా జీవిత కథ."

"భాగ్య వంతుల యింట్లోనే జన్మించాను. గారాబముతో తల్లి దండ్రులు పెంచడం, చదువు నేర్పించడము నిజము. కాలేజి మెట్లు గూడ ఎక్కనని యింతకు ముందే నీకు తెలుసు. చిన్నతనమునుండి ప్రతివారు తమ ఊహా భవనాలకు మెట్లు నిర్మిస్తూనే వుంటారు. కాని, నిలవటం కష్టము. నేను గూడ అందరివలెనే తీయని ఊహలతో, చెప్పరాని తలపులతో భావి జీవితములో చేయవలసిన కార్యాలను నిర్ణయించుకొనే దాన్ని. జీవితం ఒక నాటకము. ఆ నాటక

ములో మూడే అంకములు. మొదటిది బాల్యము, రెండవది యవ్వనము, మూడవది వృద్ధత్వము. ప్రధమాంకములో అందరి జీవితాలు సమానమని అనుకోవచ్చును. ప్రధమాంకమునకు మిగిలిన అంకములకు యేమీసంబంధముండదు. నా జీవితములో ప్రధమాంకము సంతోషముగానే గడిచింది. ద్వితీయాంకము వివాహముతోనే ప్రారంభమైంది. మంచి సంబంధము చూసి వివాహానికి ముహూర్తము నిశ్చయించారు తల్లిదండ్రులు. అది వారి బాధ్యత. కట్నాలు యిచ్చేరు. కానుకలు పంపేరు. పెండ్లి కుమారుడు అందమైనవాడే. చదువుకున్నవాడూను.''

''విధి వ్రాత ఎవరు తప్పించగలరు? అట్లని ప్రయత్నాలు మానుకోరాదు. పెండ్లి రోజువచ్చింది. పెండ్లి అయింది. నాటితో చదువుకు స్వస్తి చెప్పవలసి వచ్చింది. కార్యము అయిదవ రోజున అని ముహూర్తము నిశ్చయమైంది. మన నిశ్చయాలు, నిశ్చయాలు కావు. ఆ రాత్రే పెండ్లి కుమారునకు జ్వరము వచ్చింది. దానికి తోడు దగ్గు. మరునాడు ''అక్కా బావకు టి. బి వుందని పెండ్లి వారు అనుకుంటున్నారు'' అని మా చెల్లిచెప్పడముతోనే తల తిరిగింది. వళ్లంతా చెమటపోసింది. జ్వరము దగ్గు దాని ప్రభావమై యుంటుందని భావించేను. అమ్మా, నాన్నలతో చెప్పగా యీ సంగతి ముందు తెలుసుకోలేక పోయినందుకు విచారించారు. తమ్ముతాము తిట్టుకున్నారు, నాల్గవరోజున అధికమైంది. సంతోషానికి బదులు దుఃఖము నన్నావరించింది. నా ఆరాటం; నా మనోవ్యధ! ఆ దేవునికే తెలియాలి! రాజమంద్రి తీసుక పోయినారు. వెళ్లిన మనిషి తిరిగి రాలేదు. వేసినపరుపు యెత్తలేదు నేను. మూడు రోజుల వరకు జ్ఞప్తిలేదు. మా బంధువులు స్నేహితులు వచ్చి నా దురదృష్టానికి చింతిల్లేరు. అంతకు తప్ప మరేమి చేయగలరు? నేను విచారముతో మంచము పట్టి భర్తనుకలుసుకొంటా నను కొన్నాను. అంత పని జరగలేదు డాక్టర్ల దయవల్ల. ఇంతే నాజీవితము అని విచారిస్తూ వుండే దాన్ని. మా తల్లి దండ్రులు అంతే. మా అన్నయ్య మాత్రము మంచి కబుర్లు చెపుతూ సంతోష పెట్టడానికి ప్రయత్నిస్తూ వుండేవాడు. తిరిగి కాలేజిలో చేరడానికి యత్నించా. నా కోరిక సాగనివ్వలేదు.''

''క్లాసు పుస్తకాలకి బదులు పతివ్రతల కధలు నా టేబిలుని ఆక్రమించాయ్. సావిత్రి, అనసూయ మొదలగు పతివ్రతలందరూ గోడలను ఆక్రమించారు. ఈశ్వరుడూ, విష్ణు, లక్ష్మి, సరస్వతీ మొదలగువారు నా ఆల్మరాలను ఆక్రమించారు. రంగు చీరలు, వాయిల్ చీరలు, పట్టు చీరలకు బదులు తెలుపు వస్త్రాలు నా పెట్టెలను

ఆక్రమించాయ్. ఇలాగు ఒక సంవత్సరము గడిచింది.........అమ్మాయీ నీకేమీ అర్థము కాలేదా ? స్త్రీ రెండవ వివాహము చేసుకోకూడదట. వారి సాంప్రదాయము పై అలంకారాలన్నీ దానికోసమే. అంటే నేను మరి వివాహము చేసికొని భర్తతో సుఖించుట దోషమన్నమాట''

''స్త్రీగాని పురుషుడుగాని ఒంటరి జీవితానికి యిష్టపడరు. నా అభిప్రాయాలు వేఱు. స్వాతంత్ర్యము సర్వజనహక్కు. పురుషులకు మాత్రమే అంటే నా మనస్సు ఒప్పుకుండేదికాదు. యౌవనములోనున్న ప్రతి జీవి కామదేవత బాధకు గురికాక తప్పదు. దానిని తీర్చుకోవటానికి అనేక విధములు ప్రయత్నిస్తారు. నా విషయములో కూడ అంతే. నా ముఖ్యోద్దేశము రెండవ వివాహముచేసికోవటమే. ఈ విషయము అమ్మ చెవిలో వేసాను. కాని ఆ సంఘానికి వెఱచిన జీవి ''తప్పమ్మా యెప్పుడూ అట్లన కూడదు. నీ అదృష్టము...నీ వ్రాత...'' అంటూ యేడ్చింది. నన్ను యేడ్పించింది.''

మా అన్నయ్య స్నేహితులలో మోహన్ - మీనాన్న ఒకరు. ధనవంతుడు, గుణవంతుడు. స్వాతంత్ర్య ప్రియుడు. బి. ఏ. పాసవటంకూడ అప్పటికి జరిగింది. అతను తరచుగా మా యింటికి రావటం జరుగుతూవుండేది. అతనితో మాట్లాడటానికి అవకాశము చిక్కుతూండేది. ఒక రోజు ''మోహనరావు గారూ: మీకే వుద్యోగమూ దొరకకపోవటం ఆశ్చర్యమే'' అని అన్నాను. ''యే వుద్యోగమూ చేయడానికి యిష్టములేదండీ యేదో తిండికి యింత వున్నప్పుడు ఆ చాకిరి చేయడమెందుకండీ.'' అని జవాబు వచ్చింది. ''అట్లా అంటారేం. యింత వుండొచ్చు తిండికి. లేకపోతే జమిందారుకావచ్చు. ప్రతివారు యిట్లని కూర్చుంటే దేశము బాగుపడేదెట్లండీ'' చిరునవ్వుతో అన్నాను ''మీరు చెప్పింది నిజమే. నేను మాత్రము పూర్తిగా ఆ జాతికి చెందలేదు. నా చేతనయినంత వరకు సహాయము చేయకపోలేదు లెండీ'' నవ్వుతూ జబాబిచ్చేరు. ఇట్లు అనేకసార్లు మాటలాడటం జరిగింది. అన్నయ్యకూడ మాతో జోక్యము కలుగ జేసుకుండేవాడు. క్రమముగా మా యిరువురి మధ్య స్నేహము యేర్పడింది. ఒక సంధర్భములో

''దిక్కులేని వారిని రక్షించడం, అన్యాయం జరిగినవారికి న్యాయమిప్పించడము నా విధి'' అని వెల్లడి చేసారు. ఆ రాత్రంతా మెదడులో ఆ మాట ప్రతిధ్వనించింది. ఆ మాటలో ఎంత అర్థముంది! నేనితనిని ప్రేమించడము నగ్నసత్యం. నా ఉద్దేశము అతనికెఱుక పరచటం అసత్యం. బహుశా నా వుద్దేశము తెలిసి వుంటుందా ? లేక నన్ను ప్రేమించాడా చీ...ఒక విధవని చేసుకున్నేంత మూర్ఖుడుకాడు. ఎందుకుకా

కూడదు! ఆ మాటలలోని భావము. ఆకండ్ల లోని చిలిపితనము తను ప్రేమిస్తున్నట్లు చెప్పినట్లనిపించేది నాకు. నా అనుమానము తీర్చడానికి నా చెయి వుత్తరం వ్రాసింది. పిచ్చిపిచ్చి ఊహలను యిమిడ్చింది. అన్నయ్యకు తెలియకుండా మోహన్ జేబులో వేసింది. తిరిగి జబాబువచ్చేవరకు శ్వాస ఆగిపోయినట్లయింది. భయము నన్నావరించింది. అనుకూలముగానే జవాబు వచ్చింది. "మీ దురదృష్టానికి చింతిల్లిన వారిలో మొదటివాడిని నేను. అప్పటినుండి. మిమ్మల్ని చూస్తే జాలికలుగుతూంది. అదిగాక నీ సౌందర్యం, నీతీయనిమాటలు రోజూ నన్ను పులకరింప జేస్తున్నాయ్. నేనింత వరకు వివాహము చేసుకోపోవటానికి కారణంగూడ యీ వుత్తరంలోనే వుంది" అని కూడ వ్రాసివుంది. నా సంతోషానికి మేర లేదు. నిజము అబద్ధమాడరతను - అని మనస్సులో అనుకున్నాను. కొన్ని వుత్తరాలు మా యిరువురిమధ్య నడిచాయ్. మోహన్, నేను తల్లి దండ్రులకు అభిప్రాయాలు చెప్పనిశ్చయించుకున్నాము. చెప్పేము ఒప్పుకోలేదు. కసిర్నారు–సంఘము బహిష్కరిస్తుందన్నారు. తీరనిమచ్చ. ఏదేదో అన్నారు. పట్టినపట్టు విడువనన్నాను. బంధువులచే బోధింపించేరు, తిట్టేరు చావమన్నారు. చంపేస్తామన్నారు. ఈ సంగతి ఊరంతా ప్రాకింది. ఎక్కడ జూచినా యివే మాటలు, యేయింట జూచినా యివే గుసగుసలు. మేము వెఱవలేదు సంఘానికి–భయపడలేదు. భయపడాల్సిన అవసరమేముంది? అది మావ్యక్తిత్వం. మోహన్ తన తల్లితో చెప్పిన ఆఖరిమాట లివి "ప్రభ అపవిత్రురాలుకాదు. అనాథ. నన్ను నమ్మింది. ప్రేమించింది. వివాహం జేసుకోవటము తప్పదు." ఒక రోజున బయలుదేరాము. ఎక్కడికో మాకు తెలియ లేదు. రాత్రికాదు. పగలే. దొంగతనముగా లేచిపోలేదు. వీధిలో మమ్ముచూసిన వృద్ధ జంబుకాలు ముక్కుమీద వ్రేలు వేసుకుంటూ తిట్టేయ్. విద్యావంతులైన యువక సమూహాలు హెచ్చరించాయ్. ఈ పట్నానికి వచ్చాం."

"రిజస్ట్రారు ఆఫీసులో వివాహము జరిగింది. బంధువులు హాజరుకాలేదు. బ్రాహ్మణులు మంత్రాలు చదవలేదు. ఈ వూరిలో యెవరు పోషిస్తారు మమ్మల్ని. మీ నాన్న ఉద్యోగములో చేరక తప్పిందికాదు. కొన్ని రోజులలో తన ఆస్తి తెచ్చుకోగలిగారు. ఇదీ నాకథ. అర్థమైందా వెలివేయడమంటే? అప్పటినుండి ఎవ్వరితో సంబంధము లేకుండా హాయిగా జీవిస్తున్నాం" అంటూ ప్రభ కథ ముగించింది. శశినవ్వటము మోహనరావు యింటికి రావడము ఒకేసారి జరిగాయ్. తల్లీ పిల్లలిద్దరూ చల్లగా యింట్లోకి చేరుకున్నారు.

——(o)——

# "హవాల్‌దార్ కథ"

శ్రీమతి తు. సీతాదేవి

(గత సంచిక తరువాయి)

యీ విధముగా సంవత్సరము గడచినది. ఇంకా వాని కోరిక ఫలించలేదు. కొన్ని సమయములలో దండప్ప మనసులో యీమనిషి బ్రతికి వున్నాడా అని సందేహము కలిగినది. మరల వెంటనే జాగ్రత పడి యిట్లు తనలోతను తలచెను - ఎందుకు వుండ కూడదు? వాడు ఎక్కడో దాగివున్నాడు తప్ప కుండా ఎప్పుడో ఒకప్పుడు బయటపడును. అప్పుడు మనము జాగ్రత్తపడవలెను. పట్టుపడకపోవునా! యీ లోపున బంధింపలేనందుకు కారణములు యిచ్చి ననూ వానిపై అధికారులు వాని అప్రయోజకత్వము నకు అసంతృప్తిపడిరి. దండప్పకు యిది అంతా తెలు సును కాని ఏమిచేయగలడు. వాని ప్రాణములు ధారబోసి ఎంతో కష్టపడుచు తను చేయగలంత వరకు చేస్తున్నాడు. ఈ పని కొరకు తన్ను తానే సంతోషపెట్టుకోలేక నిందించుకుంటున్నాడు.

ఒక దినమున తన యింట్లోంచి బైటకు పనిమీద పోతూ స్నేహితునితో "రా! గంగప్పా, కొంచెము టీ నీరు త్రాగుదాము. యీ రాత్రి అంతా కాచి వుండాలి" అన్నాడు. మిత్రుడు కందవాడ రాయల్ కాఫీ హోటలులోకి తను కలిసి చివరికి వెళ్లిరి. సూర్యాస్తమానమయినది. దిపాలు వెలుగుతున్నాయి. తలుపు దగ్గరగావున్న ఒక బల్ల చివర యిద్దరు కూర్చున్నారు. టీతెచ్చేలోపల దండప్ప వాని మిత్రునితో "గంగప్పా నేనేమి చేయను - నా ప్రాణములు పోవునట్లు యీ పని మీద నాశాయ శక్తుల మనసుతీర ప్రయత్నము చేశాను. అయినా ఆ ఇన్స్పెక్టర్ సంతోషముగా లేదు. నా కన్న కొడుకు పోయినాడు. యింత కంటే ఎక్కువ కోరిక నాకు వుండునా పనిమీద? మరియు యింకా పైగా అక్కడ రూ. 2000 బహు మానము కూడవుంది" అన్నాడు. ఇంతలో యీ మాటలు పైకిరాగానే వీళ్లకు ఎదురుగావున్న మూల ఒకకుర్చీ కదలినట్లు, గట్టిగా దగ్గినట్లు వినబడెను. వాడు త్వరగా తినుట మానినట్లువుంది. వెంటనే దండప్ప దృష్టి ఆవైపుపడెను. ఆ మూల కూర్చున్న మనిషిలేచి కాఫీత్రాగకయే వెళ్లిపోతుండెను. దండప్ప అనుమానించెను. కొంచెముసేపూ వాని ముఖము తేరిపారచూచెను. తరువాత తన జేబులోవున్న ఛాయాచిత్రముతీసి రెంటి పోలికలు చూచెను. ఆ సన్నని వెలుతురులేని దీపపుకాంతిలోకూడా పోలికను గుర్తించి వీడే హంతకుడు అని నిశ్చయించెను.

దండప్ప వాని వైపుకి సాగివెళ్లెను. ఆ కుర్ర వాడు దండప్ప నుంచున్న ద్వారమువైపు చూచు చుండెను. దండప్ప తనను పట్టుకొనుటకు వస్తున్నట్లు గ్రహించి తను ముందే జాగ్రత్తగానుండి సగము తిని వున్న కారపువస్తువుల పళ్లెము దండప్ప ముఖముమీద పడునట్లు విసరి వెంటనే హోటలులోనికి పరుగెత్తెను. దండప్పకు ఆ కారప వస్తువులు కళ్లలో పడుటవల్ల కళ్లనుండి నీరు కమ్మినందువల్ల కొంతసేపు ప్రపం చమునే చూడలేకపోయెను. తను లేక యిత రులు అక్కడ ఏమిజరుగుతున్నదో తెలుసుకొను లోపల ఆ మనిషి ప్రక్కను తప్పుకుని తలుపులు గడి యలు వేసుకొనెను. వీళ్లు తలుపులు బ్రద్దలు కొట్టిరి. కాని యీ లోపల వాడు కిటికీగుండా తప్పించు కుని కందవాడివైపు పారిపోయెను. యీ ప్రాంత ములు వానికి బాగా అలవాటుపడి తెలిసిన మార్గ ములుగా నుండెను. దండప్ప, గంగప్ప వెంటనే కందవాడివైపు వానిని తరుముకొనుచూ యీలలు వేసుకొనుచూ పరుగెత్తిరి.

అప్పుడే అంబవ్వ వీధివాకిటి తలుపుదగ్గిర కూర్చుని బియ్యము బాగుచేసుకుంటున్నది. హటాత్తుగా ఎవరో లోనికి వెళ్లిన చప్పుడు ఆమెకు వినపడినది. ఆమె పైకి తల ఎత్తి చూచినప్పుడు ఎవరో నూతన పురుషుడు లోన నుంచున్నది గ్రహించెను. ఆమెకు చాలా భయము వేసెను. ఆమె కంఠమెత్తి గట్టిగా అరచుటకు ప్రయత్నించునప్పుడు, ఆ నూతన పురుషుడు భయపడి దుఃఖించుచూ ఆమె కాళ్లమీదపడి యిట్లు వినయముతో ప్రార్థించెను. "అమ్మా! భయపడకుము" ఆమె తెల్లపోయినది. అట్లానే ఆ పాలిపోయిన ముఖముతో శరీరముతో అదేపనిగా ఆశ్చర్యముతో వాని ముఖము చూడ దొడగెను. ఆ వుగ్రవాడు తానే ధైర్యము తెచ్చుకుని తలుపు మూసెను." తల్లీ నేను నీచేత రక్షింపబడి తల దాచుకొనుటకు యిక్కడకు వచ్చితిని. నీవే నాకాధారము పాలముంచినను నీటముంచినను సరే నిన్నే నమ్ముకుంటిని. నా ప్రాణములు నీ చేతిలో వున్నవి. యిట్లు చెప్పుతూ నేలమీద స్పృహతప్పి పడిపోయెను.

కొంతసేపు అంబవ్వ బాగా వానిని చూచినది అంతా పూర్తిగా గ్రహించినది కొంత కాలము తటపటాయించినది. యీ యుక్త వయసుగల చిక్కిన శరీరము పెరిగిన తల, గడ్డము, భయమును గొలుపు చూపులు వేటకు పోవుచున్న మృగమువలె ఆ చూపు చూచిన ఆమె మనసు విచారముతో మునిగి వానిమీద జాలికలిగినది. వానిమీద ఏవిధమైన అనుమానము పొందక, వాని చెయ్యి పట్టుకొని లోనికి తీసుకువెళ్లి వంటింట్లో ప్రవేశపెట్టినది.

ఆ సమయములో ఎవరో వాకిట తలుపుతెరచిన ధ్వని ఆమె చెవుల పడెను. దండప్ప మాటలువిని త్రుళ్లిపడినది. అంబవ్వ యిట్లు తనలో తను తల పోయుచుండెను- "ఆరాత్రి పనిమీద వెళ్లినవాడు యింతలో ఎట్లు తిరిగి రాగలిగెను." మరింత ఎక్కువ భయపడసాగెను. ఆమె నరములు పట్లు వీడుచున్నట్లు తోచెను. దండప్ప లోనికి వచ్చెను. ధైర్యముతో ప్రయాసపడి అంబవ్వ వెలుపలి ద్వారమువద్దకు వచ్చెను. ఆమెనుచూచి వెంటనే దండప్ప "మన యింటిలోనికి ఎవరైనా జొరబడిరా?" అని అడిగెను. అంబవ్వ కాళ్లు వణకనారంభించెను. మొదట మాట్లాడలేక పోయింది. "ఏమీ?" అని అంది. "ఎందుకంత భయపడుతున్నావు? యీ వైపు ఎవరూ పరుగెత్తినది నీవు చూడలేదా? ఎందుకంత ఆలోచిస్తావు" అన్నాడు. "లేదు" అని ఆమె ఎంతోసేపటికి ధైర్యము తెచ్చుకుని చెప్పకలిగినది. దండప్ప విసుగుతో "ఇంతసేపా లేదు అని చెప్పుటకు" అన్నాడు. "గంగప్పా! హంతకుడు యింకా ముందుకి వెళ్లివుండవచ్చును." యిట్లా అంటూ తలుపు గట్టిగా వేసి వెతుకుటకు యింకా ముందుకు వెళ్లెను. గంగప్ప మాత్రము అంబవ్వ వైఖరి అంతా గ్రహించి దండప్పతో వెడుతూ వెనుక తిరుగకుండగానే అనుమానము ఆమెమీద కలిగినది. రోడ్డుమీదకు వెళ్లగానే దండప్పను "నీ భార్య ఎందుకు అంత భయపడుతున్నట్లు కనబడుతోంది?" అని అడిగెను. దండప్ప "అది వూరికే పిరికి మనిషి; అసలు నా యెదుటే ఎంతో భయము అదిగాక మనము హంతకుడు అంటే అదిచాలు! ఆమెకు ప్రాణములు పోవునట్లు చేసియుంటుంది." అన్నాడు. గంగప్ప అనుమానముతో "హాఁ! హాఁ! అంతేనా నీవు ఆమె విషయము అనుకునేది?" అన్నాడు. దండప్ప నిశ్చింతగా "మరి ఏమిటి? ఎప్పుడన్నా నాతో అబద్ధము చెప్పుతుందా? దాని ఫలితము ఎరుగదా? నీకు తెలియదు నా భార్యను నేను ఎల్లాగుంచానో" అన్నాడు గంగప్ప దానిమీద మాట్లాడక వూరకుండెను.

అంబవ్వ హంతకుడని వినగానే ఆ సమయములో అంతా చెప్పుదామా అని మనసులో తట్టెను. అయితే దండప్ప యిల్లువదలి వెళ్లిపోయెను. అప్పుడు ఆమె మునుపటివలె నిశ్చితమైన మనసుతో గట్టిగా స్థిరపరుచుకుని యిట్లు తనలో అనుకొనెను. "పాపము! ఆ నూతన పురుషుడు మంచినీళ్లు అని సోషవచ్చినట్లు అడిగి అతినీరసముతో విచారముగా పడివుండెను. అంబవ్వ యింట్లోకివెళ్లి కొంచెము

నీరు వానికి యిచ్చెను. వాడు ఎంతో ఆతురతతో అందుకొని భోజనము కావాలి అని సౌగ్యతో అడిగినట్లు చేసెను. అంబవ్వ తన అన్నము యింకా తినలేదు. అందుకని వానికి కంచములో కొంచెము అన్నము పెట్టెను. వాడు ఎన్నో రోజులనుంచి పస్తువున్నట్లు ఆ అన్నము అంతా ఒక్కసారి మ్రింగివేసెను. అదిచూచి అంబవ్వ 'పాపము వీడు ఎన్ని రోజులనుంచో అన్నములేనట్లు కనబడుతున్నాడు."

వానికి ఆకలి తీరిన పిదప సంతోషముతో ఆ చిన్నవాడు ఆమెను యిట్లా వేడుకొనెను. "అమ్మా! నేను నిజముగా హంతకుడను గాను" "అంబవ్వ ఏమి చెప్పుటకు తెలియక పైనుంచి క్రిందకు పూరికే తెల్లబోయి చూచెను. ఆ చిన్నవాడు మిగత కథయిట్లు చెప్పెను." "ఆగష్టు 9-తేదిన భయంకరమైన పనులు జరిగినవి." పాండురంగడు చనిపోయినమాట ఆమెకు జ్ఞాపకము వచ్చినది. ఆమె వానితో అంది "నా కొడుకుకూడా తన ప్రాణములు ఆహుతి చేసెను ఆ రోజున, వాడు సరిగా నీ పోలికగానే వుండేవాడు." ఆమె కళ్ళవెంట నీరు ధారగా కారదొడగెను. ఆ చిన్నవాడు యిట్లు చెప్పెను. "అవ్వా! ఎంతమంది వాళ్ళ ప్రాణములు ఆ రోజున పోగొట్టుకొనిరి కారణము వుండిలేక. నేనైతే ఒకరిమీద నా చేయి చేసుకోలేదు. నేను కొంత చదివినాను. అయితే ఏమి? విధి అంత బలవంతమైనది. ఎన్నో తెలివితక్కువ పనులు జరిగినవి ఆ తొందరలో" అన్నాడు దీనముగా. భోజనము చేసిన పిదప వాడు ఆమెను అడిగినాడు. "అమ్మా! యీ రాత్రి యిక్కడ నేను విశ్రాంతి తీసుకొనవచ్చునా?" అని అంబవ్వ కొంతసేపు ఆలోచిస్తూ వానిని యీ అపాయమైన స్థలమునుంచి పంపించివేస్తే మంచిదేమో? అయితే వాడు ఎక్కడ దాగేందుకు స్థలము ఎట్లు సంపాదించుతాడు? బహుశ పోలీసులు యింకా వాని వెనుక వాని కొరకు తరుముతూ వున్నారేమో? ఏలకాకూడదు? అయ్యో పాపము వాని అదృష్టము ఎట్లుండునో? యీ ఆలోచన బాగుంది. దండప్ప అయితే యింకా యిప్పుడప్పుడేరాడు. రాత్రి పనిమీద వెళ్ళినాడు. ఆ చిన్నవాడు కొంత విశ్రాంతి పొందిన పిమ్మట చీకటితో వానిని లేపిపంపవచ్చును. యీ ప్రకారము నిశ్చయించుకుని వానితో యిట్లంది. "సరి! నీవు యీ వంటింట్లోనే పరుండుము. నేను బయటపడుకుంటాను. నీవు తప్పకుండా వెలుగు రాగానే లేచివెళ్ళిపొమ్ము." ఆ చిన్నవాడు రెండు చేతులు జోడించి భక్తి పూర్వకముగా నమస్కరించి యిట్లు చెప్పెను. "నీవు నా కన్న తల్లివి. యీ రోజున నాకు మరల పునర్ జన్మ వచ్చినది."

అంబవ్వ వానికి పరుండుటకు చాపనూ, కప్పుకునేందుకు శాల్వాను యిచ్చెను. ఆ చిన్నవాడు బాగా అలిసివున్నందువల్ల కొద్ది నిముషములకే గాఢనిద్రలో మునిగిపోయెను. అంబవ్వ తనలో తాను "బహుశ యీ చిన్నవాడు పాపము ఎన్ని నెలలనుండియో విశ్రాంతి లేదువలె కనబడుచున్నది." అనుకొనెను. ఆమె నిద్రించలేదు. ఆమె మనసులో అనేక విధములైన ఆలోచనలు పెడుతున్నాయి. భయము అనుమానము యిటువంటివి ఆమెను పీడించుచుండెను. సుమారు అరగంట గడచెను. అకస్మాత్తుగా ముందు వాకిటి తలుపు తెరువబడెను. ఆమె ఆ తొందరలో తలుపు గడియవేయుటకూడా మరిచిపోయినది. దండప్ప తప్ప మరి ఎవరు ఆ సమయములో వస్తారు? ఒక్కసారిగా ఆమె భయమూ ఆశ్చర్యముతో నిండిపోయినది. తను ఏమిచేయుచున్నదో ఆమెకే తెలియకనే వంటయింటిదారిలోకి పరుగెత్తినది. దానికి తలుపులులేవు. అందువల్ల దారికడ్డుగా నుంచుంది. దండప్ప యింటిలోపలికి రాగానే టోపీతీసి ప్రక్కమీద విసరి యిట్లు అనెను. "నాకు యీ రోజుతో అంతా అఖరు అయినది. యిన్ని రోజులనుంచి చేసిన ప్రయత్నము వృధాఅయిపోయింది" మంచము మీద కూర్చున్నాడు. అంబవ్వకు ఏమి అర్థము కాలేదు. ఆమెకు ఏమిచెప్పుటకు తెలియలేదు. అందువల్ల ఆమె పిచ్చిదానివలె పూరికే అంటే

అని అడిగింది. దాని అర్థము నన్ను అనుమానము కేసులో పెట్టిరి. నీకు అర్థమయినదా? నాయొక్క వుపయోగము యీ క్రొత్త యజమానికి ఏమి తెలుసును? వానికి యీ కేసుని గురించి మాత్రమే తెలుసును. నేనేమో నా బలమంతయు దానికి ధారబోసి యున్నాను. అయితే అదృష్టమనేదిలేదు. అది నాకు ఎదురు తిరిగినది. ఏమి చేయను? నాకు ఎన్నో ఛాన్సులు యిచ్చినారట! చేచిక్కిన హంతకుడు పారిపోయినాడు అని ఆయన చాలా కోపముగా నున్నాడు. అదిగాక మన గంగప్ప నామీద వ్యతిరేకముగా కథలు అల్లి మోసుకుపోయి వానికి చెప్పినాడు. నువ్వు యిట్లు చేయకూడదు, నువ్వు అట్లు చేయకూడదు. నీవు వుపాయముపన్ని వానిని పట్టుకోవలసియుండె. యీ మనుష్యులు నాకు వుపాయము నేర్పించటము, ఔను! యీ హంతకుని మూలముననే నా వున్నత స్థానము, పరువు మర్యాదలు, వుద్యోగము. ప్రమోషను, పించెను, అన్న బహుమతి రూ. 2000 అటు లుంచుము. నాయొక్క యావత్తు నడవడి గంగపాలై పోతోంది. హా! నేను వానిని మాత్రము పట్టుకో కల్గితే అంటూ ఎవరిని అడుగకుండానే వాడు బరువు అంతా దింపినట్లు తనంతతానే పరిపరి విధముల పోయిన మనసును కుదుట పర్చుకుని విశ్రాంతిగా వున్నాడు. అంబవ్వ ఏమిచెప్పలేదు. ఆమె మనసు అప్పుడు ఎట్లు వుండునో యిక్కడ వర్ణించి వ్రాయుట ఎవరితరము? పాఠకులే వూహించవలెను గాని. కొంతసేపు నిశ్శబ్దముగా వున్న పిమ్మట దండప్ప అన్నాడు. "సరి! చూద్దాములే నాకు ఒక గ్లాసు నీరు త్రాగుటకు తీసుకురా."

(సశేషము)

(480_వ పేజీలో తరువాయి)

అప్పుడప్పుడు అసహ్యత కల్గుతూన్న తన కోఱికై కాకున్నా తన కొడుకు కోఱికై బ్రతుక జొచ్చింది.

ఊళ్లో కలరా వచ్చిందన్నారు కొందరు, కాదు ప్లేగు అన్నారు మరి కొందరు. ఇనాక్యులేషన్సు చేసు కొంటే ఏవి దరిచేరవని అంటూన్నారు ఆఫీసర్లు. చచ్చిపొయ్యే జనానికి అంతేలేదు. కొందరికి కొందరు అప్పటికప్పుడే గ్రామంవదలి వెళ్ళేరు. ప్రొద్దువనగా వచ్చింది. అంతే సంజె చీకటులు అలముకోకముందే గంగమ్మ కుమారున్ని కలరా కాజేసింది. అంతే ప్రొద్దున ఆ ఇల్లు కాళీ. గంగమ్మ ఎక్కడి కెళ్ళిందాఅని ఎందరో ఎన్నోచోట్ల వెతికారు. కానీ నిష్ఫలమైపోయింది. ఎక్కణ్ణో పడి చచ్చిందనుకొన్నారు. అంతే ఆమె కథని అల్లికలల్లికలుగా అనేక విధాల అల్లి పలుపలు విధాల అనుకొన్నారు. కానీ వాండ్లెక్కడో జీవిస్తూంటారురాంటే ససేమిరా అని పెడచెవిన బెట్టేరు. వినినవాళ్లు విన్నారు. లేనివాళ్లులేదు. అప్పటినుంచి అల్లా పొడుబడింది. అప్పటినుంచి ఇప్పటివరకు గంగమ్మ అత్తాపత్తా తెలీదు అని చెప్పేవారు.

కానీ గంగమ్మ చావలేదు. తనకు "నా" అన్న దిక్కుగల వాళ్ళంతా తననుంచి వేరై పొయ్యారు. తానుమాత్రం చావలేక బ్రతుకుతూ బ్రతికేందుకు నానావస్థలు పడుతూంది. బుద్ధిచెడి దేశదేశాలు తిఱుగజొచ్చింది. ఆమెని తిక్కదన్నది లోకం. బిడ్డల్నితినే మహామ్మారి అని క్రొత్తపేరు పడిందామెకి. ఎవరి చంకలోనైనా బిడ్డ వుండటం తటస్థించిందా అమాంతంగా గంగు ఆ బిడ్డడిని తన చేతుల్లో ఎత్తి నాయనా అని బిడ్డడిని ముద్దుల్తో నింపేది. బిడ్డకామందులు తమ బిడ్డల్ని ఆమెనుంచి తీసికోడానికి ఎంతో శ్రమ పడేవారు. దాన్ని బట్టి గంగు అంత దూరంలో వస్తూందనగా బజార్లో వున్న తమ పిల్లల్ని బరబరా ఈడ్చుకొనివచ్చి యిండ్లలోకి పిలుచుకెళ్లి దభేల్లున వాకిలివేసేవారు.

ఆమెలో కరుడువారిన ఆశాజ్యోతులు అట్లే అణగారిపోయాయి. దొరికినప్పుడు తిని దొరకనప్పుడు పస్తుండటం ఆమెకొక విధాయిక కృత్యమైంది. ఎప్పుడో తనలో జీర్ణించుకపోయిన మధుర స్మృతులు తిరిగి మొలకలెత్తగలవేమోననే ఆశతోనే తిరుగుతూంది. జీర్ణించుకపోయిన ఆమె డొక్కలు నడ్డీపుకు అనుకొన్నాయి. "చుర్"మని పేగు కొట్టుకొన్నప్పుడు ఊళ్ళో అడుక్కోవటం, దాంతో కాలం గడుపుకోవటం చేస్తూందా గంగు.

గంగమ్మ ఇంకొక గ్రామానికి పోవటానికి రైలెక్కటం, టికెట్ కలెక్టరు నాల్గుతన్ని ఆమెను ఒకచోట దింపటం, దించిన గ్రామంలో ఆ రోజు కాలం వెళ్ళబుచ్చటం జరిగేది. ఆ దినంకూడా మామూలుగా ఆమెని దింపేసారు. "అమ్మా! నీకడుపులో మంచి బిడ్డలు పుట్టుతారు. అంత అన్నం పెట్టండి తల్లీ" అని గంగు ఒక యింటి ముందు నిలబడి అక్కడ అరుగుపై కూర్చొన్న ఒక విధవని అడిగింది. ఆమె మహా చండశాసనురాలు. "ఏమే! నీకేం పొగరే. అయ్యో! ఆయనగారు చచ్చి ఏడాదైనా కాలేదు తిరిగి నాకు పిల్లలెంకే; నీ మొహం మండా; నేనేమన్నా పోకిరిదాన్ననుకొన్నావా?" పో ... పో ... అని గద్దించి ... థూ ... అని ఉమ్మింది. దైవమా అంటూ నిస్పృహతో వెళ్ళింది గంగు.

నాడుకూడా దింపేసారు గంగుని. రైలునుంచి దిగి ఊళ్ళో కెళ్లింది. నాల్గు రోజులనుంచి అన్నం లేక నిస్పృహలేనంత స్థితిలోవుంది. ఊరు వెలుపల ఈమెలాంటి నిరుపేదలు నివసించే ఆలయం ఒకటి వుంది. అర్చన అంటూ లేకపోవటంచేత దేవుడు ఎల్లవేళల దర్శనమిస్తూంటాడు. ఎవరో ఒకామె తాను తెచ్చుకొన్న రొట్టెముక్కని తింటూండటం గంగు చూచింది. ఆమెలోని ఆకలి తీక్ష్ణమైంది. ఒళ్ళంత కండ్లుచేసి ఆశతో ఆమెను చూచింది. ఆమెభావం రొట్టె తింటూన్నామె కనిపెట్టి ఒక్క

ముక్క విఱచి గంగుకు అందించింది. దాన్నితిని ప్రక్కనపారే యమునలో నీళ్లు త్రాగి ఆత్మతృప్తి పడింది. ఈలా రెండుమూడు రోజులా ఊళ్లో కాలం గడిపిందామె.

నాడు ఆ దేవాలయంలో ఎవ్వరూలేరు గంగు తప్ప. మటమట మధ్యాహ్న సమయం. సూర్యుడు తన ప్రచండ కిరణాల్తో లోకాన్ని కాల్చేస్తున్నాడు. లోకంతోబాటు గంగమ్మ ఉదరంలోని ఆకల్ని పురికొల్పి దప్పికి తన్నుకలాడేట్లు చేస్తున్నాడు. ఊళ్ళో తిరిగే శక్తిలేక అలాగే దేవాలయ కుడ్యానికి ఆనుకొని వగరుస్తూంది. దేవతా సన్నిధివైపు తలెత్తి చూచింది. అప్పుడే అక్కడ ఎవ్వరో నైవేద్యం కొఱకు పళ్ళెరంలో ఫలాదులుంచి వుండటం చూచింది. వొళ్లు కళ్లు అంతా ఒకటిగా చూచింది. ఆకలి పెకేసుకొని పెల్లుబుకుతూంది. చుట్టూపట్టూ చూచింది, ఎవ్వరూ లేకపోవటం గమనించింది. మెల్లగ లోపలికి బయల్దేరింది, పళ్ళెరంలో చెయ్యిపెట్టీ పెట్టకముందే "ఏయ్! ఎవ్వరూ నువ్వు!" అనే మాటలు ఆ దేవళం అంతా ప్రతిధ్వనిస్తూ వినిపించిందామెకో కేక.

వెనుదిరిగి చూచింది. ఎట్ట ఎదుట గంభీరాకృతితో తీక్ష్ణంగా చూస్తూన్న ఒక యువకున్ని చూచింది. ఆ చూడటం అనేది 8 నిముషాలు పట్టింది. అదేమో అతన్ని చూడగానే కరుడువారిన ఆశామొక్కలు ఆమెలో మొలకలెత్తాయి. కళ్లు నులిమి చూచింది, ఆశ్చర్యపడ్డది. కలా! ... లేక ... నిజమా ...? అని మరి మరి చూచిందాతన్ని. తన భర్త ప్రతిబింబం ధ్వని, దృక్కులు ఆమెయింతకు ముందెప్పుడో జీర్ణించుకొన్నదగుటచేత అతనెవ్వరైంది కనుక్కొంది. ఇక క్షణం నిలువలేకపోయింది. "మీ ... రా ..." అనే అస్పష్ట సంభాషణోపక్రమణకు పునాది మాటలు ఆమె నుంచి వెలువడ్డాయి.

అతనికేం అర్థంకాలేదు. ఒక్కడుగు వెనక్కు వేసి బాగా చూచాడు. ఆమెను కనుక్కోగల్లేదు. తన గంగు దీనస్థితి అతన్ని ఆశ్చర్యాన్ని కలిగించింది. "క్ష ... మిం ... చ ..." యనే దీన వాక్కులతో అతని పాదాలపై వ్రాలింది గంగు. "ఏం! ఎందుకీలా అయ్యావ్? అబ్బాయి ఏడి? అమ్మమ్మ ఏది?" అనే మాటల్తో గబగబ అడిగాడు. అమ్మమ్మ ... అ ... బ్బా ... యి ...? అని చెప్పలేక చెప్పలేక జరిగిన యథార్థత తెల్పింది. అతనిలోకూడా ఏదో ఆవేదన బయల్దేరింది. ఆమెని ఎత్తి, చిన్నగ చెక్కిళ్లపై జారే కన్నీటి ప్రవాహాన్ని ఆపుకొనేట్లు తుడుస్తూ, గాద్గదంగా "ఎంత దానివి ఏలామారావు? నాదే అపరాధం నన్ను క్షమించవూ" అని అన్నాడు ఆమెనిచూచి.

భర్త కరుణార్ద్ర హృదయాన్ని స్పందించింది. దుఃఖభాజ్యమైన తన జీవితపు పొకడలో సంతోష పక్షిలోని ఒక్క కణపును నేడామె చవిచూచింది. ముదముతో ఆమెను ఇంటికి తీసుకెళ్లి తగిన ఔషధ సేవ చేయించి బాగుచేయించాడు రాంజీ. సుగుణ (రాంజీ రెండవ భార్య) ఆమెకు తగిన సేవలు చేసింది. గంగు ఆమె ఉపచర్యలకు ఆశ్చర్య పడింది. ఆమె ఔదార్యాన్ని వేనోళ్ళ పొగిడింది.

ఇప్పుడు రాంజీగార్కి భార్యలిద్దరు. ఇద్దరిని సమదృష్ట్యా చూస్తూ ఆనందంతో వెల్లివిరిసిపోయారు. సుగుణ, గంగు ఇద్దరూ గర్భవతులయ్యారు. ప్రసవించటం ఒకేదఫా కల్గటంలో ఆశ్చర్యమైంది. గంగుకు మగపిల్లవాడు, సుగుణకు ఆడమ్మాయి. అమ్మమ్మ జ్ఞాపకార్థం అమ్మాయికి అమ్మాజీ అని ముందు పిల్లకాయ జ్ఞాపకార్థం అబ్బాయికి చిన్న అబ్బాయి అని పేర్లు పెట్టారు. బారసాల వైభవోపేతంగా సాగింది. చాల మందికి విందులు జరుపబడ్డాయి. ఆనందసాగరంలో ఓలలాడిపొయ్యారా కుటుంబమంతాను.

---




**మేనరికం:-**

ప్రఖ్యాత నవలా కారుడు జంపన చంద్రశేఖర రావుగారు సృష్టిస్తున్న నూతన సాంఘిక చిత్రం. శోభనాచల స్టూడియోలో పూర్తియగుచున్నది. సంగీతం, పెండ్యాల. వరలక్ష్మి, నారాయణరావు, శివరావు, రేలంగి, శివరామ్ నటిస్తున్నారు.

**మరదలుపెళ్లి:-**

ముక్కామలచే నిర్మింపబడిన "మరదలుపెళ్ళి" రిలీజు అయింది. విజయవంతంగా పోతోంది. చాలా బాగుంది. ముక్కామల, సూర్యకుమారి, శ్రీరామ్మూర్తి నటించారు.

**పరదేశి:-**

అంజలీదేవి స్వంత చిత్రం. చాలా భాగం పూర్తయింది. దర్శకులు ప్రసాద్. రచన శర్మ. నాగేశ్వరరావు, అంజలీదేవి, వసంత, గణేశన్ నటిస్తున్నారు.

**పుట్టిల్లు:-**

రాజా ప్రొడక్షన్స్‌వారి ఈ చిత్రం చాలా బాగుందని వార్తలు వచ్చుచున్నవి. దీనిలో కేవలము స్త్రీనే ప్రధానముగా చేసికొని రాజారావుగారు నూతన నటులతో, తొలిప్రయత్న మయినప్పటికి చక్కగా తీయుచున్నారు.

**ముగ్గురు కొడుకులు:-**

ఆంధ్ర దేశంలో విడుదలై దిగ్విజయంగా పోతోంది. నాగేంద్రరావు, కన్నాంబ సహజంగా నటించారు. జానకి తన చిత్రాలన్నింటి కంటె బాగా నటించింది.

**సింగారి:-**

నేషనల్ వారి చిత్రం. ఆంధ్ర దేశంలో విడుదలైంది. లలిత, పద్మిని, రాగిణి, సహస్రనామం నటించారు.

**ఆదర్శం:-**

శుభోదయావారి చిత్రం. సావిత్రి, రామశర్మ బాగా నటించారని వార్తలు వచ్చుచున్నాయి. విడుదలకు సిద్ధంగా నున్నది.

**ఆకలి:-**

మిర్జాపూర్ రాజావారి నూతన సాంఘికం. కృష్ణవేణి, ప్రభాకరరావు, లక్ష్మిరాజ్యం నటిస్తున్నారు.

**సొసైటీ పిక్చర్సు:-**

24 లక్షల వ్యయంతో తయారవుతున్న ఈ చిత్రంలో నాగయ్య, జి. వరలక్ష్మి, లక్ష్మికాంతం మొదలైనవాళ్ళు తెలుగులోను, టి. కే. భారతి, రాజమ్మ మొదలైనవాళ్ళు అరవంలో నటిస్తున్నారు.

# నవచైనాలో కుటుంబ, వైవాహిక చట్టాలు

శ్రీ వి. సిసాయేవ్

1950 మార్చి 1 వ తేదీన చైనా ప్రజా ప్రభుత్వం వివాహానికీ, కుటుంబానికీ సంబంధించిన చట్టాన్ని అమలు జరపడంతో స్త్రీలను బానిసలుగా వుంచిన కుటుంబ, వైవాహిక సంబంధాల ఫ్యూడల్ పునాదులు తుత్తుగియలైనాయి.

పాతచైనాలో కుటుంబ వ్యవహారాల్లో స్త్రీలకు హక్కులు లేకపోవడ మనేదాన్ని ఒకపురాతన చైనీస్ సామెత చక్కగా వుదాహరిస్తుందని "షాంగైన్యూస్" అనేపత్రిక 1951 జూన్ 6వ తేదీన వ్రాసింది. "భార్య అనేది నీగుర్రం లాంటిది; నీ ఇష్టమైతే దానిమీద స్వారి చేస్తావు; నీ ఇష్టమొచ్చినట్లూ తృప్తితీరా దాన్ని తంతావు," ఇదీ ఆసామెత.

పూర్వం చైనాలో కుటుంబ పెద్ద అయిన భర్త వైవాహిక, కుటుంబ సంబంధాలలో సర్వాధికారి. చైనాలో యిటీవలవరకూ బహుభార్యాత్వం ఆచరణలో వుండేది. అంతేకాదు వుంపుడు కత్తెలను వుంచుకోడం, ఆడపిల్లలను, (చిన్నపిల్లలను కూడా) భార్యలుగానూ, ఉంపుడుకత్తెలుగానూ చేసుకోడానికి కొనుక్కోవడం ఆచరణలో వుండేది.

ఈనాడు, ప్రజా చైనాలో కార్మిక వీరవనితగానూ, పెకింగ్ ప్రజా విశ్వవిద్యాలయంలో విద్యార్థినిగానూ వున్న లిపెంగ్‌లీన్ గాథ పాతచైనా పరిస్థితిని కొంతవరకు తెలియజేస్తుంది. ఆమె ఇలా వ్రాసింది. "ఎనిమిదేళ్ల వయస్సప్పుడే నేను మా భూస్వామి కొడుకుకు (వీడికి పక్షవాత రోగం వుండేది) భార్యగా వెళ్లవలసి వచ్చింది. ఎందువల్లనంటే యీభూస్వామికి మాతండ్రి ఋణపడి వున్నాడు. వేసవిలోనూ, చలికాలంలోనూ కూడా నేను చిరిగిన గోనెబట్టలు మాత్రమే కట్టుకున్నాను. నేను పచ్చికేబేజీ తినేదాన్ని; కటికనేల మీద పడుకునేదాన్ని; నా అత్తగారిచేత తన్నులు తినేదాన్ని; వీటిమూలంగా నేను రెండుసార్లు ఆత్మహత్యకు ప్రయత్నించేను." ప్రజాతంత్రశక్తుల విజయం వల్లనూ, అమెరికన్ సామ్రాజ్యవాదరక్షకులతో బాటు అభివృద్ధి నిరోధక కుమింటాంగ్ ముఠాను దేశంనుండి తరిమివేయడం మూలంగానూ లిపెంగ్‌లీన్‌కూ, తదితరు లనేకమందికి సౌఖ్యమయ జీవితం గడిపే అవకాశం లభించింది.

వివాహానికీ కుటుంబానికీ సంబంధించిన కొత్తచట్టం కుటుంబ సంబంధాలలో ఫ్యూడల్ ఆచారాలనన్నిటినీ రద్దుచేసింది; బహుభార్యాత్వాన్ని నిషేధించింది; ఏకపత్నీ వ్రతమే చట్టబద్ధమైనది. ఈచట్టరీత్యా వివాహం ఒక ప్రజా కోర్టులో రిజిస్టరు కావాలి. బలవంతంగా పెళ్లి చేసుకోవడం - యీ బలవంతం తల్లి తండ్రులనుండి వచ్చినా, ఎవరినుండి వచ్చినా సరే నిషేధింపబడింది. వధూవరులిద్దరూ యథేచ్ఛగా వివాహం చేసుకో దలచుకుంటేనేగాని వివాహం జరగడానికి వీలులేదు.

విడాకులిచ్చే సందర్భంలో చట్టరీత్యా భర్త తన భార్యకు మనోవర్తి ఇవ్వాలి; పిల్లల్ని పోషించాలి. కుటుంబ ఆస్తి విడాకులిచ్చుకునే భార్య భర్తలమధ్య పంపకమవుతుంది.

అభివృద్ధి నిరోధక పరిపాలనలో వివాహం చేసుకొన్నవారు, (ముఖ్యంగా స్త్రీలు) యీకొత్త చట్టం ప్రకారం విడాకులకు ప్రజా కోర్టులో అర్జీపెట్టుకో వచ్చును. భర్త భార్యపట్ల దుర్మార్గంగా ప్రవర్తిస్తే చాలు విడాకులకు అర్జీ పెట్టుకోవచ్చును. కోర్టువారు అటువంటి సందర్భాలలో సాధారణంగా అనుమతి ఇస్తారు.

1951 తొలి మూడు మాసాల్లోనూ వివాహ సంబంధాలకు చెందిన 24,758 కేసులు తూర్పుచైనా ప్రజాకోర్టులలో పరిష్కారమైనాయి. వాటిలో చాలమట్టుకు స్త్రీలు విడాకులకు పెట్టుకున్న దావాలు. అర్జీలలో బహుభార్యత్వం, బలవంతపు పెళ్లి, భర్తగాని, బంధువులుగాని దుర్మార్గంగా ప్రవర్తించడం, మొదలైన కారణాలివ్వబడ్డాయి.

## నవచైనాలో కుటుంబ, వైవాహిక చట్టాలు

వివిధ సాంఘిక శాఖలకు చెందిన స్త్రీలు విడాకులకు దావాలు వేశారు.

ప్రఖ్యాత షాంఘై నటి పాన్ స్యుయింగ్ కొన్నేళ్ల క్రితం షాంఘై నాటకశాల యజమాని లిఛిహెంగ్‌కు బలవంతంగా వుంపుడుకత్తె కావలసివచ్చింది. ఆనాడు యువతిగా వున్న యీనాటి తన "భర్త"కు అణిగి మణిగి పడివుండి, అతనికోసం పనిచెయ్యవలసి వచ్చేది. చాలాకాలం వరకూ లిఛిహెంగ్ ఆమె గడించిన సొమ్ము పూర్తిగా వాడుకునేవాడు. ఆమె అసహ్యించుకుంటున్న యీ మనిషినుండి ప్రజాకోర్టు ఆమెను విముక్తి చేసింది.

ఛెన్‌సాయ్‌టి అనే ఒక కార్మిక స్త్రీ ఆమె తలిదండ్రుల బలవంతంవల్ల యాన్‌చింగ్‌పా అనే దర్జీవాడికి భార్య కావలసి వచ్చింది. భార్యచేత పనిచేయిస్తూ యీ దర్జీవాడు తనుపనిమానేసి, జూదగాడైనాడు; మీదుమిక్కిలి ఆమెను తన్నేవాడు. ఈవిధంగా కొమింటాంగ్ పాలనలో చాల కాలం సాగింది. ప్రజా ప్రభుత్వం కొత్త చట్టాన్ని అమలు జరిపిందని వినగానే యీ దురదృష్టవంతురాలు విడాకులకు ప్రజాకోర్టులో దావా వేసింది. కోర్టువారు ఆమెకు విడాకులకు అనుమతిచ్చి, భార్యను కొట్టినందుకు భర్తకు ఒక ఏడాది ఖైదు శిక్ష వేశారు.

కోర్టువారు ఎల్లప్పుడూ స్త్రీయొక్క, ఆమె పిల్లలయొక్క శ్రేయస్సును దృష్టిలో వుంచుకుంటారు. వైవాహిక తగువులలో ప్రజాకోర్టు ప్రప్రథమంగా బహు భార్యాత్వాన్ని నిర్మూలించడానికి ప్రయత్నిస్తారు. ఈసూత్రాన్ని కాలదన్నిన వారికి చట్టరీత్యా ఖైదు శిక్ష వేయవచ్చును. కానీ, ప్రజాప్రభుత్వం ఏర్పడక పూర్వం జరిగిన వివాహాల విషయంలో (బహు భార్యాత్వం కేసుల్లో) కోర్టువారు జాగ్రత్తగా ఆలోచిస్తారు.

చైనాకేంద్ర ప్రజా ప్రభుత్వంవారు అమలు జరిపిన ప్రధాన రాజకీయ ఆర్థిక, సాంఘిక మార్పులు, వివాహం కుటుంబ సంబంధాలకు చెందిన చట్టం విజయవంతంగా అమలు జరగడానికి హామీనిస్తున్నాయి. ప్రజాచైనాలో స్త్రీ పురుషులకు సమాన హక్కులను ప్రకటించడం, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కార్యకలాపాల్లో స్త్రీలు కూడా ఎక్కువగా పాల్గొనేటట్టు చెయ్యడం, భూసంస్కరణకింద స్త్రీలకు పురుషులతో సమానంగా భూమిని కేటాయించడం మొదలైన చర్యలవల్ల కుటుంబ సంబంధాలలో ఫ్యూడల్ ఆర్థిక రాజకీయ సాంఘిక పునాదులు పూర్తిగా కదిలిపోయాయి. ఈకొత్త చట్టం చైనీస్ స్త్రీల బానిసత్వాన్ని రద్దుచేసింది.

## నాయనమ్మ నిద్ర



ఒక 80 ఏండ్ల ముసలమ్మ మనుమరాలితో "లలితా! టైము అయింది నిద్ర పోమ్మా" అన్నది.

"నేనిప్పుడే పండుకోను నాయనమ్మా"

"అలా అనకూడదమ్మా. ఇప్పుడు ఏడుగంటలయింది. ఏడేండ్ల చిన్నపిల్లలందరు తప్పకుండా ఏడుగంటలకే పండుకొని నిద్రపోవాలి."

"నేను 8 గంటలకే పండుకొంటాను"

"నీకు 8 ఏండ్లు రాగానే 8 గంటలకు నిద్రపోదుగాని, కాని యిప్పుడు నీకు 7 ఏండ్లే కాబట్టి 7 గంటలకు నిద్రపోవాలి. నీకు 9 ఏండ్లు రాగానే 9 గంటలకు నిద్రపోదువుగాని."

"అయితే నీ వెప్పుడు నిద్రపోతావు నాయనమ్మా."

# లోకవార్తలు

అడయారు బ్రాడ్ రోడ్డులో ఆంధ్రమహిళా సభ నర్సింగ్ హోము ప్రారంభోత్సవము భారత ఆర్థిక మంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ గారిచే అతివైభవముగా జరిగింది.

◆ ◆ ◆

'మద్రాసు సుందరి' శ్రీమతి టంగుటూరి సూర్యకుమారిగారు అమెరికా ప్రభుత్వ ఆహ్వానముపై హాలీవుడ్‌కు యీనెల 12వ తేదిన ప్రయాణమయి పోవుదురట.

◆ ◆ ◆

మదనపల్లె మహిళా సమాజం 10వ వార్షికోత్సవము ది17-8-52న శ్రీమతి ఆర్. రత్నాబాయిగారి అధ్యక్షతను జరిగింది.

◆ ◆ ◆

ఇటీవలనే తిరుపతిలో స్త్రీల కొక ప్రత్యేక కళాశాల స్థాపించబడింది. ఏలూరులో కూడ స్త్రీలకు ప్రత్యేక కళాశాల స్థాపనకు జిల్లాబోర్డువారు స్థలమును కేటాయించినారట.

◆ ◆ ◆

భారత కార్మిక మంత్రి శ్రీ వి. వి. గిరిగారు ఖరగ్‌పూరులో మద్రాసు నగరభవితవ్యాన్ని గురించి వివరించుచు మద్రాసు నగరాన్ని చీఫ్‌కమీషనరు రాష్ట్రంగా గాని, లేక కూవమ్‌నది సరిహద్దుగా ఉత్తర దక్షిణ ప్రాంతాలుగా విభజించదగునని సూచించారు.

◆ ◆ ◆

ఒంగోలులో రంగారావు చెరువుపై నిర్మింపబడిన మహాత్మాగాంధీ మునిసిపల్ పార్కులో లలితకళాభివృద్ధికి మునిసిపల్ కమీషనర్‌గారు గానసభలను ప్రతివారం ఏర్పాటు చేశారు.

◆ ◆ ◆

దక్షిణ ఆసియా దేశాల మహిళల సమావేశాన్ని డిశంబరు చివరి వారంలో ఢిల్లీలో జరుపడానికి ప్రపంచ వైజ్ఞానిక సంస్థ ఏర్పాటు చేస్తున్నది. సాంఘిక విజ్ఞాన శాస్త్రీల సహాయంతో సాంఘిక, రాజకీయ, ఆర్థిక, న్యాయరంగాలలో స్త్రీల వాస్తవిక పరిస్థితిని, హోదా ఏమిటి అనే విషయాన్ని చర్చించి నిర్ణయించడం, అభివృద్ధి కార్యక్రమాన్ని సూచించడం సమావేశం యొక్క ముఖ్యోద్దేశమట.

◆ ◆ ◆

ఇండియానుంచి ఎగుమతి కాబడే చేనేత వస్త్రీల విక్రయం నిమిత్తం చెన్నరాష్ట్రం నుండిగాని, కేంద్ర ప్రభుత్వమునుండిగాని కొందరు మార్కెటింగు ఆఫీసర్లను విదేశాలకు పంపాలని మద్రాసు ప్రభుత్వం ఢిల్లీని కోరిందట.

◆ ◆ ◆

మూడేళ్ల పసిబిడ్డను ఢిల్లీనగరంలో ఆసుపత్రి నుండి ఒక స్త్రీ అపహరించిన దనే నేరమును మేజస్ట్రేటు విచారణ సందర్భములో, ఆమె తనకు బిడ్డలు లేరనియు, అందువలన తన భర్త రెండవ వివాహం చేసుకొంటాడేమోననే తపనవలన తానీపని చేశానని చెప్పుచు క్షమాపణ కోరిందట.

---o---

# పెండ్లి చూపులు

పాత్రలు :

| | | |
|---|---|---|
| భ్రమర | — | పెండ్లికూతురు. |
| కుమారస్వామి | — | పెండ్లికూతురి బావ |
| వల్లి | — | పెండ్లికూతురి అక్క |
| సంపెంగరావు | — | పెండ్లికుమారుడు. |
| విద్యావతి | — | పెండ్లికుమారుని మిత్రుడు. |

బంట్రోతు

వల్లీ:-భ్రమరా ...

భ్రమర:- ... ...

వల్లీ:-(పెద్ద గొంతుతో) ఏమే — ఏంచేస్తున్నావు. గదిలో, ఎప్పుడూ ఆకమ్యూనిస్టుల పుస్తకాలేనా మరి వేరే పుస్తకాలే లేవూ! లేచిరా యిపాటికి.

భ్రమ:-(విసుగ్గా) అబ్బ, ఏమిటీగోల? – ఎప్పుడూ. నాయిష్టం. నాకునచ్చిన పుస్తకాలు.

వల్లీ:-ఆ! నచ్చిన మొగుడు కూడాను.

భ్రమ:-(కోపంగా) చాల్లే. సంతోషించారు, నాకు పెండ్లే అక్కర్లేదు, మరి యిల్లా అన్నావంటే అమ్మదగ్గరకు పోతా.

కుమా:-ఏమిటర్రా ఆ గందరగోళం, ఆఫీసు పని కూడా కావటంలేదు మీ అరుపులతో - భ్రమా ఇల్లారా ?

భ్రమ.-చూడు బావా! మా అక్క. ఎప్పుడూ మొగుడూ పెండ్లీ .. మరోమాటే లేదు. పోనీ బావా నీకాగితాలు నాకిచ్చేయి. అన్నింటి మీదా నీదస్కత్తులు పెట్టేస్తాను.

కుమా:-ఆ! అంతపనీ చేస్తావు, మీరు సామాన్యులా అయినా, ఎందుకు తొందరపడతావు నావంటి.

వల్లీ:-ఇంజనీరు కిచ్చే పెండ్లి చేస్తారా.

భ్రమ:-అక్కా నాకోపం వస్తోంది.

వల్లీ:-ఏం ... రానీ. ఇదిగో సాయంత్రం నిన్ను చూట్టానికి వస్తాట్ట ఆయింజనీరు పరీక్ష అయిన సంపెంగ.

భ్రమ:-ఛీ, అతని ముఖంకూడా చూడను. ఆనర్సు ఫైనలు ప్యాసయినవాడూ ...

వల్లీ:- పోనీ. బియ్యే ప్యాసయిన వాడి నే పెండ్లాడు, ఎవరు వద్దన్నారు.

కుమా:-ఇంతకూ చెప్పరేం. పెండ్లి చూపులన్నమాట.

వల్లీ:-ఆ! అదే యీ సంబరమంతా.

కుమా:-ఇంతకూ ఎవరూ వచ్చేది.

వల్లీ:-అబ్బా, ఏం నంగనాచులండీ. మీకు తెలియనే తెలియదు కాబోలు. మీపేరుతోనేగా ప్రొద్దున్న కవరు వచ్చింది.

కుమా:-ఏదీ నే చూడందే. పోనీలే చెప్పండి.

వల్లీ:-ఎముంది చెప్పేందుకు.మీరు ప్రయత్నం చేసేరే- ఆ అబ్బాయే. ఐదుగంటలకు విద్యావతి కవయిత్రి, శ్రీ, శ్రీ, పెండ్లికుమార్తెగారిని చూట్టానికి వస్తారట. ఏమంటారో వీరు ?!

కుమా:-ఆ! ఏమంటుంది. పెండ్లాడతానంటుంది. పిల్లలను కంటానంటుంది. అసలు మీయింటి పేరే పిల్లల ...

భ్రమ:-చాల్లేబావ. నన్నేం చూడక్కరలేదు. బి. యే. డిగ్రీ తీసుకుంటేనేగాని పెండ్లాడను.

కుమా:-కాదు భ్రమా! తీరా వారు వస్తారా, కాదంటే గౌరవంకాస్తా పోతుంది. చూడూ- నీయిష్టం అయితేనే ... కాస్త ముస్తాబుగా మరి. ఎవర్రా! ఆమేడమీద గదిలో కుర్చీలు అవీ సరిగా వేయండర్రా.

వల్లీ:-బావా మరదలూ ఒక్కటీ.

కుమా:-ఇదిగో. అలా అనకుమరి చిన్నపిల్లాయను. సిగ్గుపడుతోంది. నేను నిన్ను చూట్టానికి వచ్చినప్పుడు మరి వంచిన తలే యెత్తావు కావు. అలాగే.

వల్లీ:-సరే, బాగానే వుంది సరసం.

(సాయంకాలం గడియారం అయిదు గంటలు కొట్టింది.)

బంట్రోతు:-అయ్యా, వారువచ్చారయ్యా.

కుమా:-(విసుగ్గా) కొంచెంసేపుండమను. వెధవా- ఆఫీసుపని చేస్తుంటే వారూ - వీరూ.

బంట్రోతు:-కాదయ్యా, అమ్మగారిని.

కుమా:-అమ్మగారినా! ఎవర్రా గాడిదా.

బం:-కాదుదొరా, మరదలు అమ్మగారిని అయ్యా.

కుమా:-(తొందరగా) ఒరేయి పెండ్లివారట్రా త్వరగా పైకి తీసుకురా. వెధవకు చెప్పటం తెలిస్తేగా.

(కుమారస్వామి, సంపెంగరావు, విద్యాపతి. కూర్చొని వుంటారు.)

కుమా:-చాలా సంతోషం

విద్యా:-మా సంపెంగరావు చాలా కరెక్టు మనిషండీ. ఒక్క నిమిషం కూడా దాటనీయడండీ.

కుమా:-అలాగే మరీ, భ్రమరా ఇలారా.

భ్రమర:-(వచ్చి కూర్చుంటుంది.)

కుమా:-ఈమె మామరదలండీ. భ్రమర అంటాం.

విద్యా:-పూర్తిపేరు.

కుమా:-చెప్పవమ్మా, చూస్తావేం.

భ్రమ:-చివర అంబ అని వుంది.

విద్యా:-మావాడు సంపెంగ. మీరు భ్రమర. భలే బాగుంది.

కుమా:-మీకు యెస్ట్రాలజీ వచ్చల్లేవుండే.

విద్యా:-ఎబ్బె, కాదండీ ... పేర్లు.

సంపె:-మావాడు కథలు వ్రాస్తూవుంటాడు లెండి.

విద్యా:-నా కథలకేంగాని, భ్రమరాంబగారిని పలుకరించవోయి.

సంపె ఏంచదివారు మీరు. మీ ఏజి.

భ్రమర:-18. ఇంటర్ ప్యాసయినా.

సంపె:-ఏసంవత్సరం.

భ్రమర:-1951. మీరు.

సంపె:-స్కూలుఫైనలు ప్యాసయి. ఎల్. సి. యమ్. పరీక్ష అయినా 1951 లోనే.

భ్రమర:- మీఫాదరు.

సంపె:- ఐ. జి,

భ్రమ:-అంటే, ఇన్స్పెక్టరు జనరలా.

కుమా, విద్యా,-(నవ్వు)

సంపెంగ:-(కొంచెం కోపంతో) కాదు, ఇరిగేషను గుమస్తా మీ ఫాదరో.

భ్రమ:-చచ్చిపోయినారు.

కుమా:-అవును. లాస్టు యియరే పోయినారు. చాలా పలుకుబడి కలవారు. రిఫార్మరు కూడాను. కట్నం యిచ్చి పెండ్లి చేయాలంటే కర్రపుచ్చుకొనేవారు. నాకూ కూడ కట్నం యివ్వలా.

విద్యా:-మావాడు అల్లాకాదండోయి. ఆరువేలు యిస్తేనే.

వల్లీ:-(అప్పుడేవచ్చి) పైన.

విద్యా: యథావిధిగా లాంఛనాలూ ... ... భ్రమరాంబగారూ, సంగీతం, చిత్రలేఖనం, కవిత్వం కుట్టుపనులు, యిల్లాంటివాటిల్లో మీకు ప్రవేశం-

భ్రమ:-ఉంది. కథలు, గేయాలూ, వరకట్నాలు పనికిరావనే వ్యాసాలూ వ్రాస్తూవుంటా.

బొమ్మలు మాత్రం గీయలేను. సరదాగా కుట్టు పనులు నేర్చుకున్నా.

సంపె:- మీ వ్యాసాలు అచ్చయినాయా.

భ్రమ:- మా కాలేజి మాగజైనులో కొన్ని పడ్డవి. వ్రాసినవి అల్లాగే వున్నవి యింకా. మీకు పైవాటిల్లో_

విద్యా:- అవంటేనే మావాడికి గిట్టదు. నాకథ యెప్పుడైనా వినిపిస్తే తలనొప్పిరా అంటాడు.

వల్లీ:- అల్లాగా అండీ.

సంపె:- చాలా టైమైంది.

విద్యా:- నమస్తే, సెలవు. థాంక్స్.

కుమా:- మీ అభిప్రాయం.

సంపెంగ:- తరువాత వ్రాస్తానండీ. మాఫాదరుని కలిసి. (మేడదిగుతూ,) విద్యా! పాతికేళ్లుంటయిరా. బలేగడుసుది. బాబోయి నాకొద్దు.

విద్యా: ఛీ నోరుమూయి. చాలా తెలివైంది.

కుమా:- భ్రమా! ఏమంటావు.

కుమా:- మొదటే చెప్పాగా. ఆనర్సులు ఫైనలు ప్యాసైనవాడూ, కట్నం కావాలి అనేవాడూ, నాకువద్దని. వాడిముఖం చూట్టానికే నాకుయిష్టం లేదు. అక్కకు ఆగ్రహం వస్తుందని...

వల్లీ:- మరి యెల్లాగ పెళ్లి.

భ్రమ:- ఏం కాకపోతే. చదువుకొని వుద్యోగం చేస్తాను.

కుమా:- మంచిమాటన్నావు. 'భుక్తికి వేళ అతిక్రమించె' పోదాం కిందికి.

కూచిబొట్ల కామేశ్వరి

# ఒంగోలు కళాశాల ప్రారంభోత్సవం

## విద్యామంత్రి ప్రభృతుల ప్రసంగాలు: శ్రీరామశర్మగారి వదాన్యత ప్రశంస

ఒంగోలులో స్థాపించిన చివుకుల శ్రీరామశర్మ కళాశాల ప్రారంభోత్సవం ఆగష్టు 31 న సాయంత్రం జరిగింది. విద్యాశాఖ మంత్రి డాక్టర్ మల్లవరపు వెంకట కృష్ణారావుగారు అధ్యక్షత వహించారు. న్యాయమూర్తి ప్రత్తిపాటి సత్యనారాయణరావు గారు ప్రారంభోత్సవం జరిపారు. బెజవాడ గోపాల రెడ్డిగారు స్నాతకోపన్యాసం చేశారు.

కళాశాల కమిటీ అధ్యక్షుడు ధారా గోపాల శాస్త్రిగారు కళాశాల స్థాపనకై జరిగిన కృషిని వివరించారు. కార్యదర్శి విరాళాలు వాగ్దానం చేసిన వారికి భూరి విరాళ మిచ్చిన శ్రీరామశర్మగారికీ కళాశాల స్థాపన కృషిలో తోడ్పడిన వారికీ ప్రారంభోత్సవానికి వచ్చిన పెద్దలకూ ధన్యవాదాలు తెలిపారు. చిలకపాటి అనంతకృష్ణమాచార్యులుగారు శ్రీరామశర్మగారి ఔదార్యాన్ని కొనియాడారు. కావలి కళాశాల ప్రిన్సిపాలు యమ్. రామానుజరావు నాయుడుగారు శ్రీరామశర్మగారి చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ శర్మగారు ఈ కళాశాలను తమబిడ్డను వోలె కాపాడవలెనన్నారు.

అధ్యక్షుడు వెంకటకృష్ణారావుగారు ప్రజలే భూరి విరాళాలిచ్చి విద్యాభివృద్ధికి తోడ్పడుట శుభ సూచకమంటూ ప్రభుత్వం తరఫున శ్రీరామశర్మ గారిని అభినందించారు.

ప్రారంభకుడు సత్యనారాయణరావుగారు తెలుగు దేశములో కళాశాలలు తక్కువనీ, శ్రీరామ శర్మగారు చెన్నపట్నంలోని కేసరిగారిని తలపించు చున్నారనీ వారికి తమ అభినందనలనీ అన్నారు. కళాశాలలలో వృత్తివిద్యలు బోధించాలన్నారు. మనకు మంత్రులు మారినప్పుడల్లా విద్యావిధానం మారుతోందన్నారు.

గోపాలరెడ్డిగారు మన రాష్ట్రంలో అన్ని జిల్లాల కంటే గుంటూరుజిల్లాకు విద్యాసక్తి ఎక్కువన్నారు. తెలుగు జిల్లాలలోని కళాశాలలో ఇది 28 వది అన్నారు. మంత్రులు మారినప్పుడల్లా విద్యా విధానం మారుతున్నదన్న విమర్శకు సమాధానముగ, విద్యావిధానమును ఇప్పటికి ఎవ్వరూ నిర్ణయించ లేదనీ, మార్పులు కేవలము తాత్కాలికములేననీ, విమర్శించేవారు ఎట్లావుండాలో సూచిస్తే బాగుం టుందనీ అన్నారు. పదిఏండ్ల ఈమధ్య వెనుక బడిన జాతులు విద్యలో ముందంజ వేసినవారిని ప్రోత్సహించవలెననీ అన్నారు. ఆంధ్రరాష్ట్ర విషయమై ప్రశ్నించగా తామావిషయం ముచ్చటించటం అనవసరమనీ ఆంధ్రులలో రాష్ట్రవిషయం కంటే భాషాభివృద్ధి ఎక్కువ కావాలన్నారు. వెనుకజరిగిన కాల్పులకు బాధ్యులని తమను నిందించిన కొందరు పెద్దలు నేడు కాలేజికి సహాయము చేశారని తమను పొగడుట చోద్యంగా వున్నదన్నారు. తుదకు, కళాశాలకు భూరివిరాళమొసగిన శ్రీరామ శర్మగారిని అభినందించారు.

పిమ్మట చీరాల కళాశాల ప్రిన్సిపాలు శ్రీరామా రావు, గుంటూరు హిందూ కళాశాల ప్రిన్సిపాలు వల్లభజోస్యుల సుబ్బారావు, ఈకళాశాల ప్రిన్సిపాలు ప్రతాపగిరి రామమూర్తి, అధ్యాపకుడు రామచంద్ర రావుగార్లు విద్యా విషయాలపై ఉపన్యాసాలు చేశారు. రామచంద్రరావుగారి వందనాలతో సభ ముగిసింది.

నిన్న ఉదయం ప్రిన్సిపాలు రామమూర్తిగారు కళాశాల ఆవరణలో జాతీయపతాకం ఎగురవేస్తూ, అందరము ఈపతాకాన్ని గౌరవించి దీని ఛాయనే భావిజీవితాలకు మెరుగులు దిద్దుకోవాలని ప్రబోధించారు.

(15-9-1952 నుంచి, 15-10-1952 వరకు)

# మాసఫలితాలు

త్రికాలవేది, జ్యోతిష్యచక్రవర్తి, ప్రొఫెసర్ కె. అంజి

### మేషం :

ఎంత తప్పించుకొని చరిస్తామనుకొన్నా కొనసాగనివ్వరు, ద్రవ్యం వృథా ఖర్చుచేస్తూవుంటారు, పోటీల్లో తారుమారు, స్వంత వార్లతో పగవస్తుంది, గృహకుటుంబాభివృద్ధి కల్గుతుంది, బుద్ధి ప్రకాశం, ఇష్టాల జయం కల్గుతుంది, అదృష్ట జయంకద్దు.

### వృషభం :

చిల్లిపైసాకూడా బైటపెట్టరనిపించుకొంటారు, లోకంలో ఉన్నపేరు కాస్త తగ్గుతూ వుంటుంది, మిగత విషయాలు అన్నీ శుభం, శాస్త్ర ప్రియత్వం అధికం.

### మిథునం :

విసువు తగ్గదు, మాటలు సాత్వికంగా రావాలని ప్రయత్నించండి, ఆలోచనలు విజయవంతములు, పైత్యాధిక్యం, సన్మానింపబడుతారు, బంధునిష్ఠూరాలు తప్పవు,

### కటకం :

మిశ్రాదాయం, పురుషులకు స్త్రీలు పెత్తనం వహించుతారు, స్త్రీలకు చిన్నలు పెత్తనం వహించుతారు, రాజబంధువృద్ధి, వృత్తి వ్యాపార ఉన్నత పదవీ లాభం, ధనకనకవస్తు వాహన సేవకలాభం.

### సింహం :

ఆదయవ్యయములు సమానములు, కోమట్లవల్ల మేలు, పనికిరాని వస్తువులవల్ల బంగారం, విలువకు అమ్ముకొంటారు, ధనపు కసాల తగ్గిపోతుంది, పిలుపులు అధికంగా వస్తూవుంటవి, రాత్రిళ్లు నిద్ర కొంచెం తగ్గుతుంది, స్త్రీ విరోధం కష్టాలను తెచ్చిపెట్టుంది.

### కన్య :

ధనకాంక్ష అధికం అవుతుంది, అన్నీ మరల క్రొత్తగా మెరపు పెట్టించి, సానపట్టించి క్రొత్త సంస్కరణలను చేయించి లాభాన్ని గణిస్తారు. దుర్వ్యయం తప్పుకోలేరు, ఆఫీసర్లు అధికారం చెలాయింప చూస్తారు.

### తుల :

అఖండజయం, శుభవార్తావళి, విచిత్ర వస్తులాభం, మహేంద్రయోగం, సౌఖ్యం పెరుగుతుంది, పిల్లాజెల్లలు మిత్రుబంధువృద్ధి, శృంగార వస్తు వస్త్రములకై వ్యయాధిక్యం, రాజకీయ రాజతుల్యత్వంకద్దు, శిరోనేత్రదంత బాధలు రావచ్చు.

### వృశ్చికం :

నమ్మిన వారంతా వ్యతిరిక్తం, ఇరుగు పొరుగులతో పగ, బంధు చింత, విషజంతు భీతి, అసౌఖ్యం, డాక్టర్ల సహాయం, దైవ నవగ్రహ సేవా పూజలు చెయ్యండి.

### ధనస్సు :

ఆపదలు తప్పుతవి, కోరికలన్నీ యీడేరుతవి, వినోద విహారం, రత్నాభరణ వస్త్రవస్తు వృద్ధి, బంధువుల రాకపోకలు, అంచనా మించిన వ్యయం, సుఖాసక్తి.

### మకరం :

అధర్మంలోకి బుద్ధిపోతుంది, చిన్నలకు బంధుమిత్రులకు హాని, శుభాశుభ మిశ్రిత కాలం, అతిశ్రమకోర్చుదురు, విద్యావినయ సంపన్నత్వం, విశ్రాంతిపై యిష్టం, వేదాంత ప్రీతి, దొంగల భయం.

### కుంభం :

పుణ్యక్షేత్ర సందర్శనం, మహైశ్వర్యం, బుద్ధి వికాసం, ఆదాయవృద్ధి, శత్రు జయం, నవీనుల స్నేహం, మనోరథసిద్ధి, స్త్రీ బంధు వ్యాపారలాభం, విచిత్రవస్తు ఆదాయం.

### మీనం :

రాజగౌరవం, మంచివార్ల స్నేహం, ధనాభివృద్ధి, శ్రీమంతులపై అధికారం చలాయించుతారు, భోగభాగ్య ప్రదం, మహాత్ములసేవ, విద్యాలాభం, రాజాశ్రయం, అదృష్టజయం, నానార్థసిద్ధి.

——X——

# సంపాదకీయములు

## సంస్థలు — నిర్వాహణ

మన ఆంధ్రులచే అనేక సంస్థలు స్థాపించబడుచుండుట, కొద్దికాలనికే నామరూపాలు లేకుండా పోవుచుండుట చూస్తున్నాము. అందుకు సంస్థల నిర్వాహణలో లోపం, స్వార్థపరత్వం, కార్యదీక్షాలేమి కారణములు.

ఆంధ్రమహిళాసభ కంటె అనేక సంవత్సరముల ముందు స్థాపించబడిన చెన్నపురి ఆంధ్రమహాసభను మహిళాసభతో పోలిచిచూస్తే ఆంధ్రమహిళాసభ అభివృద్ధికి వ్యవస్థాపకురాలు శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి పట్టుదల, కార్యశూరత్వము, నిర్వాహణా సామర్థ్యముల ప్రత్యేకతను వ్యక్తము చేయగలవు.

ఆంధ్రమహిళాసభ తన అభివృద్ధితోబాటు ఉత్తమ లక్ష్యాలతోటి మహిళాలోకానికి సేవచేయ డానికి కంకణం కట్టుకోడం అభినందనీయం.

ఈనాడు అడయారు బ్రిడ్జ్‌రోడ్డులో మాతా శిశు సంరక్షణశాఖను నిర్వహించ ప్రభుత్వము పయితము వారికి సహాయపడటం ఎంతో సంతోషకరమయిన విషయం.

నర్సింగ్ హోమ్ ప్రారంభోత్సవ సందర్భమున శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు చెప్పినట్లు 'వైద్యులను, నర్సులను గ్రామాల వంకకు ఆకర్షించాలి.' లభించే వైద్య సహాయం పట్టణములలో విశేషముగా కేంద్రీకరించబడుతున్నది. గ్రామవాసుల జనాభా అధికమయియుండీ కూడ వారికి క్రమమైన వైద్యసహాయం లేక చావులు, ఆరోగ్యలోపం అధికంగానున్నవి. గ్రామప్రజల ఆరోగ్య, అభ్యుదయాలకుగాను ప్లానింగ్ కమీషన్ పంచవర్ష ప్రణాళికలో మాతా శిశువుల సౌభాగ్యానికి ప్రాధాన్యత నిచ్చినందుకు అభినందనీయులు.

మంత్రిదేశముఖ్ గారు వైద్యసహాయపు కొరతకు 3 కారణాలు వివరించారు. అందులో మొదటిది తగినంత విద్యార్హతగల స్త్రీలు ఆరోగ్యాలు నర్సులుగా వృత్తి నవలంభించనుండుటకు ముందంజ వేయకపోవుట, రెండవది తగిన బోధనా పరికరాలు, సమర్థులగు ఉపాధ్యాయులుకల శిక్షణ కేంద్రాలు బహుస్వల్ప సంఖ్యలోనుండుట; మూడవది ఇట్టి కేంద్రాలను సమకూర్చగల ఆర్థికస్తోమతు మనకు లేకపోవడం.

మొదటి కారణమునకు ప్రజలే బాధ్యులయినా మిగిలిన రెంటికి ప్రభుత్వము బాధ్యత వహించక తప్పదు. తగిన బోధనా పరికరాలను, సమర్థులగు ఉపాధ్యాయులతో శిక్షణ కేంద్రాలను చాలినన్నిటిని ప్రభుత్వము స్థాపించలేకపోవడం విచారకరం. ఇక ఆర్థికస్తోమతు విషయం చూస్తే ఆరోగ్యానికి, వైద్య సహాయానికి ప్రాధాన్యమిస్తూ బడ్జెటు తయారుచేయువచ్చు. దానితోబాటు ప్రజాసహకారం కూడ నున్నచో పై మూడు సమస్యలు పరిష్కారం కాగలవు.

## దానము — ధర్మము

దాన ధర్మములు పలువిధములు. వానిని చేయవలసినవారు శ్రీమంతులు. అయితే యుక్తాయుక్త ములను, అవసరానవసరములను గుర్తించి విచక్షణాదృష్టితోటి, విశాలహృదయంతోటి దాన ధర్మములను చేసేవారు కొద్దిమందే యుంటారు.

అనేక మంది ధనవంతులుండవచ్చును. అనేకమంది వేలు, లక్షలు ధనమార్జించుచుండవచ్చును. కాని ఉదారహృదయంతో ఉత్తమలక్ష్యాలను సాధించగల ఆదర్శప్రాయమైన సంస్థల నిర్మాణమునకు భూరివిరాళము లిచ్చువారిని వ్రేళ్లతో లెక్కబెట్టవచ్చును. సాధారణంగా కొందరు శ్రీమంతులు తమ ధన ద్రవ్యాలను విలాస జీవనము కొరకు వినియోగిస్తారు. మరికొందరు తాము అనుభవించక, సంఘ శ్రేయస్సుకు వినియోగించక తమ సంపదను పిసినారితనంగా దాచే వాళ్లున్నారు.

ఈమధ్యనే ఒంగోలులో కళాశాల స్థాపించబడింది. ఇలా స్థాపించబడుతుందని అనుకొనినవాళ్లు బహుకొద్దిమంది; కాని శ్రీయుత చివుకుల శ్రీరామశర్మ గారి భూరివిరాళం యింతత్వరలో కళాశాల స్థాపనకవకాశమిచ్చిందనక తప్పదు.

శ్రీ శ్రీ రామశర్మగారు సంపన్నులయినా నిరాడంబర జీవి. పూజ్యులు, బంధుజనప్రియుడు, సత్ హృదయము కలవారు. ఈ విషయాలు వారి ప్రేమ ఆదరణలను చవిగొన్నవార నేకులకు తెలుసును. ఈ మధ్యనే ఏర్పడిన తెనాలి, చీరాల, కావలి కళాశాలల స్థాపనతో బాటు ఒంగోలులో కళాశాల స్థాపన ఎంతైనా అవసరమయింది. ఈ విషయాన్ని గుర్తించి ముందంజవేసి భూరివిరాళమిచ్చి కళాశాల స్థాపన కవకాశము కలుగజేసినందుకు శ్రీ శర్మగారు అభినందనీయులు.

వీరికీ ఉత్సాహం ప్రేరేపణ కలుగడానికి కారణములు వారు వ్రాసినట్లు మదరాసులోని కేసరి విద్యాలయములు, ఒంగోలులోని పిసుపాటి వెంకటరంగయ్యగారిచే స్థాపించబడిన విద్యాలయము, వారు చేసిన దానధర్మములు. ఇదే విధంగానే వీరిని చూచి ఆంధ్ర దేశంలోని శ్రీమంతులు విద్యాలయాల స్థాపనకు, గ్రంధాలయాలు, ప్రసూతి కేంద్రాలను స్థాపించడానికి భూరివిరాళములిచ్చి మిగిలినవారికి ఆదర్శప్రాయులు కావాలి.

శ్రీ శర్మగారు ఒంగోలులో ఒక దేవాలయాన్ని, గ్రంధాలయాన్నిగూడ నిర్మించారు. ఈ వృద్ధాప్యంలో భగవంతుడు వీరికి ఆయురారోగ్యములను ప్రసాదించుగాక.

——(o)——

# స్వీ కా ర ము



దేవుని పుట్టు పూర్వోత్తరాలు: శ్రీ గోరా, 'సంఘం' పాఠకసమితి, ప్రొద్దుటూరు, కడప జిల్లా. వెల 0-5 0

గ్రంధకర్త నాస్తికవాది. నాస్తికతత్వాన్ని ప్రచారము చేయుటకని విధివిరామము లేకుండా కృషి చేస్తున్నారు. ఈ సందర్భంలో యీ చిన్న పుస్తకమునందు దేవుని పుట్టుపూర్వోత్తరాలను వివిధ శీర్షికలుగా వివరించారు.

రాధారహస్యము: విద్వాన్ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు. ప్రచురణ కర్తలు, సాధనగ్రంధమండలి, తెనాలి, వెల రు 1-4 0

ఇది మతసంబంధమయిన గ్రంధము. ఇందు భక్తి, భగవంతుడు మొదలగు విషయములను వివరించుచు రాధ, కృష్ణుల సంబంధ బాంధవ్యములు, కృష్ణావతారమునందలి వివిధ సన్నివేశాలు, ఘట్టాలు, వివరించబడినవి. భక్తిప్రబోధకరమగు గ్రంధము లనేకములను సాధనగ్రంధమండలివారు ప్రచురించారు. ఇందులో నిదియొకటి. ఈసందర్భములో వీరభినందనీయులు.

——(o)——

# శ్రీ నందననామ సం॥ర భాద్రపద-ఆశ్వయుజమాసములు.

| | | | |
|---|---|---|---|
| 1952 సం॥ సెప్టెంబరు నెల | 16 | మం | త్ర 60-10 ఆశ్లే 31-42 త్యా 4-24 |
| | 17 | బు | త్ర 3-50 మ 37-42 ది 4-3 త్యా 4-24 |
| | 18 | గు | చతు 8-19 పూఫ 43-27 మహాలయామావాస్య |
| | 19 | శు | ● అమా 12-25 ఉఫ 48-43 ది 2-24 పితృయజ్ఞః |
| | | | ఆశ్వయుజమాసం |
| | 20 | శ | శుద్ధపాడ్యమి 15-52 హ 53-15 త్యా 3-15 కలశస్థాపనం శరన్నవరాత్రారంభం |
| | 21 | ఆ | విదియ 18-27 చి 46-59 వి 14-19 భానువిదియ |
| | 22 | సో | తదియ 19-59 స్వా 59-15 ది 11-15 |
| | 23 | మం | చ 20-21 విశా 60-10 ది 13-24 కుజ చతుర్థి |
| | 24 | బు | ప 19-27 విశా 0-18 ది 10-18-లలితావ్రతం |
| | 25 | గు | ష 17-20 అనూ 0-12 జ్యే 49-5 ది 13-59 తిరుపతి వెంకటేశ్వరస్వామి గరు[డోత్సవం |
| | 26 | శు | స 14-2 మూ 56-55 ది 18-23 దేవీనవరాత్రం సరస్వతీపూజా |
| | 27 | శ | అ 9-42 పూషా 53-37 ది 19-29 దుర్గాష్టమి |
| | 28 | ఆ | న 8-28 ఏవ్యం 54-14 ది 12-10 |
| | 29 | సో | ఏ 52-12 శ్ర 45-7 రా 24-30 దగ్ధయోగం |
| | 30 | మం | ద్వా 45-38 ధ 40-28 రా 27-19 |
| 1952 సం॥ అక్టోబరు నెల | 1 | బు | త్ర 39-13 శత 35-57 రా 21-4 |
| | 2 | గు | చతు 33-12 పూభా 31-44 రా 24-38 గాంధిజయంతి |
| | 3 | శు | ○ పౌ 27-46 ఉభా 28-13 రా 27-13 |
| | 4 | శ | బ పాడ్యమి 23-16 రే 25-31 |
| | 5 | ఆ | వి 19-42 అశ్వ 23-50 హ 43-46 తిథిద్వయం |
| | 6 | సో | త 17-24 భ 23-17 రా 23-17 రా 23-39 |
| | 7 | మం | చ 16-17 కృ 23-58 త్యాజ్యాభావః |
| | 8 | బు | ప 16-25 రో 25-51 ది 5-10 |
| | 9 | గు | ష 17-37 మృ 28-53 రా 21-49 త్యా 4-16 |
| | 10 | శు | స 20-12 ఆర్ద్ర 32-57 ది 31-55 శూన్యతిథిః |
| | 11 | శ | అ 23-34 పున 37-52 ది 5-19 |
| | 12 | ఆ | న 27-37 పుష్య 43-25 అహ 29-26 |
| | 13 | సో | ద 3-29 ఆశ్లే 49-20 త్యా 4-24 |
| | 14 | మం | ఏ 36-40 మ 55-2 త్యా 4-24 |
| | 15 | బు | ద్వా 41-28 పూఫ 60-10 ది 17-14 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.